# NEELA SUNDARI

## (A Pouranic Story)

By

SRIPADA SUBRAHMANYA SASTRY

First Edition – November 1959

Price Rs. 2-00





Publishers :- ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

# నీలా సుందరి

"ఓహోయ్ పెసుగూ" అంటూ ఝాంకారంగా వొకమాట వినపడగా "ఆ, యెందుకోయ్ డబ్బా?" అని ధీమాగా యెదురడుగుతూనే ఠకీమని ఆగిపోయి, ఆవిసురికి పడిపోకుండా, గజగమనానికి తోడు వయ్యారంగా వూపుకుంటున్న రెండు చేతులతోనూ నెత్తిమీది గంపపట్టుకుని, ఆబరువుకి లేనడుము జవజవలాడిపోతుండగా వూగిసలాడుతూనుంచుని, మాటవచ్చిన దిక్కుకి పక్కవాటుగా చురుకూచురుకూ చూసింది. భద్ర.

ఎటుచూసినా, మహాసముద్రంలాగ కనుచూపు మేర, మోకాలిలోతున వొకటే చెంగలిబీడు.

ఆ బీటిలో అక్కడో మామిడీ, అక్కడో నేరేడూ, అక్కడో చింతా, అక్కడో తుమ్మా, అక్కడో తాడీ చెదిరి చెదిరివున్నాయి.

అక్కడక్కడచిన్నా పెద్దాతుప్పలుకూడా కొన్నివున్నాయి.

మరకతమణులు పరిచినట్టున్న ఆ బీట్లో, అక్కడక్కడ సముద్రపుకెరటాలమీది నురగల్లాగ పెద్దపెద్ద ఆలమందలు.

ఆ మందలోనుంచి యీ మందలోకీ, యీ మందలోనుంచి మరో మందలోకీ రంకెలు వేసుకుంటూ మదించిన ఆబోతులు తిరుగుతున్నాయి.

దూరందూరంగాపోతున్న ఆవులను అదలించి గుంపుల్లోకి చేరుస్తూ, అక్కడక్కడ గొల్లపిల్లకాయలు రకరకాల ఆటలాడుకుంటున్నారు.

అనంతమైన నీలాకాశాన సన్నని పాలపుంతలాగ విశాల మైన అడవిలో సన్నగా, తెల్లని కాలిబాట వుంది.

ఆ బాటలో నిలిచిపోయింది భద్ర.

ఆమెకి వుత్తరంగా పదిగజాల దూరాన విరగకాసి పండ బారిన కాయల బరువుతో నేలంటా కొమ్మలు వంగిపోయిన మామిడిగున్న వొకటీ, దానికి పడమరగా పదిగజాలలో వొక తుప్పా వున్నాయి.

ఏర్పరించుకోలేక భద్ర తుప్పకేసీ, గున్నకేసీ చూస్తూ వుండగా "అమ్ముతావా ?" అంటూ మళ్ళీమాట వచ్చింది.

"కొంటావా ?"

"చిల్లరగా యిస్తావా ?"

"చిల్లర వుందా ?"

"చిల్లరకేం లోటు టోకూవుంది కావాలంటే."

"చిల్లరగా యివ్వాకేం, కడవల కొద్దీకూడా యిస్తాను కావాలంటే"

ఈ మాట ముగియడమే తడవుగా "అలారమ్మంటావా, యిలా వస్తావా ?" అనడుగుతూ, తుప్పఅవతల, విభూతి పింజె కట్టుతో వొక బ్రాహ్మణయువకుడు లేచి నుంచున్నాడు.

అతణ్ణిచూసి, "తెలవక నువ్వన్నాను, కోపం చేసుకో బోకండి అయ్యవారూ" అంది భద్ర, వినయం కనుపరుస్తూ.

"నడిచి నడిచి తాపం యెత్తిపోయివున్నాను, కోపానికేం గానీ — త్వరగా కసింత పెరుగు — చూడూ, వుంటే మీగడ పెరుగు —"

అంతలోనే నోరూరి మరి మాట్లాడలేకపోయాడు బ్రాహ్మణ యువకుడు.

“అత్తవారి ప్రారంభించానడక అయ్యవారూ?” అనడుగుతూ అతనిదగ్గిరకే చేరుకుంది భద్ర.

“మీ అమ్మకడుపుచల్లగా — నువ్వు సరిగా కనిపెట్టావు గొల్లభామా! చూడు. రాత్రి నిద్ర లేదు, తెల్లవారినదక — నానా దీనా —” అని నీరసం నటిస్తూ, వున్నచోటే చదికిల బడ్డాడు బ్రాహ్మడు.

భద్ర గంప దింపుకుంది.

బ్రాహ్మడికి, రెండుగజాలదూరాన, తుప్పకి సమీపంగా పెరుగుముంతా, దానికి రెండుగజాలలో చలిదిచిక్కమూ వున్నాయి.

అదిచూసి ముందు ఆశ్చర్యపడి, చివరికి చురచుర చూస్తూ “చలిదిమూటా, పెరుగుముంతా కూడా తెచ్చుకున్నావే అయ్యవారూ?” అనడిగింది భద్ర.

దానిమీద “శ్రీహరీ, శ్రీహరీ” అంటూ చెవులు మూసుకునీ, అలాగేవుండి మొగం గున్నమామిడికేసి తిప్పుకునీ “కృష్ణా, కృష్ణా” అని పిలిచాడు బ్రాహ్మడు.

“కృష్ణుడిక్కడే వున్నాడా అయ్యవారూ?” అనడుగుతూ భద్ర పైటసవరించుకుంటూ వుండగా “వచ్చె వచ్చె” అంటూ రెండుమామిడిపళ్ళు చేతపట్టుకు చక్కావచ్చాడు కృష్ణుడు.

భద్ర, కృష్ణునికేసి ఓరచూపులు చూసింది.

“ఏం, భయపడ్డావా జయంతా?”

"భయం కాదోయ్"

"మరేమిటోయ్"

"గొల్ల పిల్లకాయలతో తిరుగు తున్నందుకు — గొల్ల భామా —"

"ఏమన్నదయ్యా?"

దీనికి బదులు చెప్పకుండా "ఏవీ, పళ్ళా, పోరకాయలా?" అనడుగుతూనే కృష్ణుని చేతవున్న మామిడిపళ్ళు వొడిసి లాక్కున్నాడు జయంతుడు.

"ఎక్కడివి అయ్యవారివయ్యా?" అంది భద్ర.

విరగబడి చూస్తూ "ఏం?" అన్నాడు జయంతుడు.

"పెరుగుగంప చూసి 'పెరుగోయి పెరుగు' అన్నావు. ఇంతలో మామిడిపళ్ళు చూసి యిది విడిచిపెట్టి వాటిమీద పడ్డావు. ఇక్కడ నేనులేకపోతే, కాస్సేపుచూసిచూసి చప్పిమూటు మీదకూడా —" అంది భద్ర, కృష్ణునికేసి చూస్తూ చిరు నవ్వుతో.

"చూశావా కృష్ణా?"

"చూడకేం? మరి నువ్వుండిన స్థితేమిటి, నువ్వు చేసిన పనేమిటి, కాకపోతే?"

"అయితే, నువ్వు పెరుగు కొనిపెట్టు. బ్రాహ్మలు కొనకపోతే పెరుగు చూపించి నీళ్ళమ్ముతారు గొల్ల భామలు"

దానిమీద "నువ్వు దూరంగా వెళ్ళు అయ్యవారూ" అంది భద్ర, తాను గంపమీదికి వాలి, చెయ్యూపుతూ.

"ఏమమ్మా?"

"బ్రాహ్మల కంటబడితే గడ్డ పెరుగయినా హరించి పోతుంది మామ్మా."

"చూశావా కృష్ణా, చూశావా?"

"మాఅమ్మపంపిన పెరుగు పుచ్చుకోవయ్యా, నీకీగొడవలన్నీ యెందుకూ?"

"మరి నీకు?"

"ఈపూటకి కొనుక్కుంటాను"

"ఎంతమాట అన్నావు కృష్ణా, డబ్బులుకి నీకు పెరుగమ్ముతానా నేను?" అని కించపడుతూనే, గంపలో నుంచి ఒక ముంత తీసి కృష్ణుని కేసివుంచింది భద్ర.

"నీసంగతి నాకు తెలుసులేవోయ్?" అన్నాడు జయంతుడు, భద్ర కేసిచూచి తల యెగరవేసుకుంటూ.

"ఏందవ్వోయ్ నీకు తెలిసింది?" అని యెదురడిగింది భద్ర.

"ఇక్కడ కృష్ణుడికోముంత వూరికేయిస్తావు. అక్కడ బ్రాహ్మణఆడవాళ్ళదగ్గిర వొకముంతకి రెండుముంతల వెలలాగేస్తావు. కాకపోయినా, నువ్వుప్రేమగా పెరుగిస్తావు, ఇతను కమ్మగా తాగేస్తాడు. ఇలాగ, మీరిద్దరూ జట్టుకట్టుకుని బాగానే వుంటారు; కాని, తాను పంపిన పెరుగు నేను పుచ్చుకుంటే యశోదమ్మగారూరుకుంటారా?" అన్నాడు జయంతుడు.

"జయంతా, నిన్నెప్పుడయినా ఏమన్నా అందా మా అమ్మ?"

"అదికాదోయ్"

"ఇదీ కాదోయ్. నేను చెప్పినవెంటనే మాఅమ్మపంపిన

పెరుగుతా గేసి, యీమామిడిపళ్ళు పుచ్చుకునిపుంటే, నువ్వో పాటి కేలావుందువో —"

"వెనక్కి మళ్ళి — అంచె పరుగులమీాద అత్తవారియిల్లు చేరుకుని — లక్షణంగా —" అంటూ కళ్ళు చికిలించుకుంది భద్ర.

"ఏమిటి లక్షణంగా?" అంటూ గుర్రుగా చూశాడు జయంతుడు.

చూసిచూసి, మొగం వంచుకుని "యెంత దురదృష్టవంతు రాలో ఆయిల్లాలు పాపం"

"ఆగు ఆగు" అన్నాడు కృష్ణుడు.

భద్ర మళ్ళీ కూచుంది.

"నీ పేరెవరూ?"

"భద్ర, కృష్ణా"

"ముందున్న వూళ్ళో నువ్వు వ్యాపారం చేసుకోవాలి, నాకు తెలుసు — కాని, ఇతను నాప్రాణస్నేహితుడు. పైగా, బ్రాహ్మ ణోత్తముడు. ఇతనిమీాద కోప్పడితే నామీాద కోప్పడ్డట్టే"

"వద్దు వద్దు, కృష్ణా! నీ కాళ్ళకి మొక్కుతా" అంది భద్ర చేతులు దోయిలించుకుని.

"తప్పు తప్పు, కుర్రవాళ్ళని పెద్దవాళ్ళు మొక్కకూడదు. ముద్దు పెట్టుకోవాలి" అన్నాడు జయంతుడు ఉపదేశముద్రపట్టి.

భద్ర కోపంగా చూసింది.

"జయంతా, కాస్సేపు నువ్వు అవతలికి వెళ్ళు" అన్నాడు కృష్ణుడు.

"అబ్బా, మహాచెడ్డ నీరసంగా వుందయ్యా" అంటూ

కూచున్నవాడు కూచున్నట్టుగా పడుకున్నాడు జయంతుడు.

"అయితే, యీ ముంతలో పెరుగు పుచ్చుకో అయ్యగారూ"
అంటూ గంపలోనుంచి వోకముంత బయటపెట్టింది భద్ర.

"వొట్టి నీరసమే కాదు, కాళ్ళుకూడా లాగుతున్నాయి"

"అయితే, యీ ముంతలో పెరుగు పుచ్చుకో"

"ఆకలి, ఆకలి, కడుపు నకనకలాడిపోతోంది."

"అయితే, యీ ముంతలో పెరుగు"

"దాహం — నాలుక పిడచకట్టుకు పోతోంది."

"అయితే, యీ ముంత"

"కళ్లు చీకట్లుకమ్ముతున్నాయి"

"అయితే, యీముంత"

"చెవుల్లో హోరుకూడ పుట్టుకువస్తోంది"

"అయితే, యీ ముంత"

"అబ్బా, ఓపలేను కదా?"

"అయితే, నువ్వలాగే పడుకుని వుండి, నోరు మాత్రం తెరిచివుంచు —" అంటూ మరోముంత పుచ్చుకు లేచింది భద్ర.

అది చూసి "ఆగు ఆగు" అంటూ గభీమని లేచికూచుని "కృష్ణా! ఏమిటీ ఘోరద్వాపరం?" అన్నాడు జయంతుడు ముక్కుమీద వేలుపెట్టుకుని.

"ఏమిటయ్యా ఘోరం?"

"ఒక్కొక్క ముంతలో పెరుగులో వొక్కొక్క గుణమా? నమ్మవలసిందేనా?"

"ఎందుకు నమ్మకూడదూ?"

"నమ్మను, నమ్మనయ్యా కృష్ణా, ఇందులో ఏదోవుంది"

"అవును వుంది అయ్యవారూ" అంది భద్ర.

"ఆ, నేను చెప్పలేదూ?" అన్నాడు జయంతుడు.

"ఏమిటి భద్రా, ఆవున్నది?" అనడిగాడు కృష్ణుడు.

"మావూళ్ళో —"

"మీ దేవూరో ముందుకానియ్యి" అన్నాడు జయంతుడు.

"అ—ల్లదిగోనయ్యా, మిథిల యెరగవ్వా?"

అనడిగింది భద్ర, వెనక్కిచూసి తర్జనితో నిర్దేశిస్తూ.

"వోస్, మిథిలే యెరక్కపోవాలి. మాకృష్ణుని అమ్మమ్మ గారి ఊరేగా?"

"అయితే, మావూళ్ళో, మా కుంభకందారగారి కెన్ని ఆలమంద లున్నాయో యెరుగుదువా మరి?"

"నీకొక్క మంద అయినా లేదనికూడా యెరుగుదును, తెలుసా?" అన్నాడు వెటకారంగా జయంతుడు.

"ఈ అయ్యగారితో యెలా వేగుతున్నావు కృష్ణా?"

"వేగడం కర్మం ఏమీ? నవనవలాడుతూ వేసుకొస్తు న్నాడు కనబడదూ?"

"భద్రా, అసలు, మరిచిపోయావు" అన్నాడు కృష్ణుడు.

"లేదు కృష్ణా, లేదు, ఆలమందలన్నీ వెతికివెతికి ఏడాకె య్యల నేరుకుంది మాదొరగారి కూతురు"

"ఏడాబెయ్యలుట. చాలా బాగుంది. చివరికీ—" అంటూం జయంతుడేదో అనబోగా, మాట కడ్డంవచ్చి కృష్ణుడు "కుల

సర్వత్రా లేదు. మహాసముద్రాలేదు. మహార్షు లేదుగురు. వారాలేదు. ఏడువారాల సొమ్ములు నువ్వేరిగినవే—"

"మీయింటో అందరికీ వున్నాయిగా?"

"మీయింట్లో వొకరికీ లేవన్నమాటేగా?" అని బదులు తీర్చింది భద్ర, వెటకారంగా.

జయంతుడు గుర్రుగా చూశాడు.

"ఏం, ఎందుకా చూపూ? చెబితే చెప్పే దేమిటంటావు, చెప్పకపోతే చెప్పావా అంటూ రగడపెంచుతావు, ఎక్కడి అయ్యవారుగివి సామీ నువ్వు?"

"నువ్వన్నీ సగంసగమే చెప్పి, నేను, రగడ పెంచానంటావు, మరి మీకుంభకందొరగారి కూతురిపేరు చెప్పావా మరి?"

"మాయయ్య కూతురిపే రెరగవ్వు జయంతా?" అనడి గాడు కృష్ణుడు.

"నా కదే జ్ఞాపకమా?"

"పోనీ, ఆ అమ్మాయిపేరు సీల కాదంటమ్మా?"

"అయితే, నువ్విది సీలపాలపెపుగే అంటావు, ఇంతే కామాంమ్మా?"

"కత్తిత్తో కొయ్యాలి చూసుకోవయ్యా — ఇంత గడ్డకట్టి పోయివుంటే—" అంటూ వొకముంత మెత్తి వంచి చూపిం చింది భద్ర.

"ఒప్పుకున్నాను, సరే ఏడాబెయ్యాల సేరుకుంది మీ సీల. తరవాత?"

"అవి మేడూ మేడు గిత్తల్ని పెట్టాయి"

"అన్నీ గిత్తలే ?" అనడిగాడు జయంతుడు.

"అక్కడికే వుందన్నమాట ఆ ఆవుల విశేషం"

"విశేషమంటాను ? అవి గిత్తలంటే గిత్తలంటయ్యా ? దుర్గా అమ్మవారి పెనిమిటి సాంబమూర్తి లేడూ ? ఆసాంబమూర్తి వాహనం నంది లేదూ ? ఆనంది చాలదు ఆగిత్తలికి"

"కలపటంచేసి చూశారా ?" అనడిగాడు జయంతుడు.

"అవి యెదగవద్దూ ?" అన్నాడు కృష్ణుడు.

"ఇంకా యెప్పుడో నా యెదగడం, యిప్పటికి మూడేళ్ళ గిత్తలవి" అంది భద్ర సగర్వంగా.

"అయితే, వాటికి కైలాసానికి వెళ్ళేకాలం వచ్చింద న్మాట" అన్నాడు జయంతుడు.

"వెళ్ళవయ్యా, నేర్చుకుపోయారు" అంటూ మూతి ముడుచుకుంది భద్ర, లేవబోతూ.

"కూచోవమ్మా, నేర్చుకువచ్చాను ?" అంటూ అంతకంటే మూతి ముడుచుకుని, గొప్ప పట్టుకున్నాడు జయంతుడు.

"చూశావా కృష్ణా ?"

"మా జయంతు డన్నమాటలో తప్పేంవుంది భద్రా ? మీగిత్తల దగ్గిరికి నంది వస్తుందా, నందిదగ్గిరికే మీగిత్తలు వెళ్ళాలా, కలపటం కావాలంటే ?" అని యెదురడిగి సరి చెప్పాడు కృష్ణుడు.

"పోన్, అనంటయ్యా ?" అంది భద్ర.

"గమ్మత్తు చూశావు కృష్ణా ? ఈ గొల్లబాను కళ్ళెంత

త్వరగా యెర్రబడతాయో ముఖం అంత త్వరగా తెల్లబడి తుంది సుమా."

"నా మీద కసిస్వాం కసుతున్నావా అయ్యవారూ?"

"నీకెక్క దెబ్బను; కాని బహుమతీ వేశావా మరి?"

"ఇదిగో పుచ్చుకోవయ్యా" అంటూ భద్ర, వాక పెరుగుముంత జయంతున కిచ్చింది.

"మహాసరసురాలవు నోల్ల భామా, నువ్వు. దినమ్మా నువ్వే దారిచే వస్తావుండు. రేపట్నుంచి నీ మీద పద్యాలే కట్టిస్తాను చడాకడా" అని ప్రీతిగా ఆముంత అందుకుని దగ్గిర పెట్టుకున్నాడు జయంతుడు; కాని "యిది కాదు. నువ్వు మా అమ్మ పంపిన పెరుగే పుచ్చుకో" అంటూ కృష్ణుం డా ముంత లాక్కున్నాడు.

"అవి నీలపాల పెరుగయ్యా" అన్నాడు జయంతుడు.

"కనుక, నా కదే కావాలయ్యా" అన్నాడు కృష్ణుడు.

భద్ర చకితఅయింది.

'కృష్ణా, కృష్ణా, నీకు నీలపాల పెరుగే కావలసి వచ్చిందా" అంటూ ముగ్ధఅయిపోయిందామె.

"ఇదిగో, చూడూ, నువ్వు వచ్చాటప్పటికి నే నుండక పోయినా, నీలపాల పెరుగు కృష్ణుని కిచ్చి వెడుతూ వుండం" అన్నాడు జయంతుడు.

"కృష్ణా, ఇంతకంటే నాకు మన్నన మరేం వుంది? నీపాదాలు మొక్కుతానయ్యా" అంటూ కృష్ణుని పాదాల కేసి చేతులు చాపి, నేల అంటి కళ్ళకద్దుకుని "కృష్ణా, నీల తన యేడుగి త్తల్నీ తన అన్న సిరిదాముని కిచ్చేసింది. సిరిదాముని

కా గి_త్తలే లోకం. ఇవాళ, రంగిడి కోసలో మొల్ల పండా లంటుగా? అక్కడి కెళ్ళాలు గి_త్తల్ని తోలుకునీ అతగాడు. కృష్ణా, నీల తన యేడావులపాడీ మాకేయిస్తుంది, అమ్ముకో డానికి. కావడి యెత్తుకుని మా నాయుడు ముందు వెళ్ళాడు, నేనూపోతా. పొద్దెక్కిపోతే రంగాపురం బాపనమ్మలు యెగిసె కంటో పడతారు" అంటూ లేచి, చివాలున గంప యెత్తుకుని "నల్లవాడే, గొల్లపిల్ల వాడే" అని మెల్లిగా పాడుకుంటూ పదిగజాలకోమాటు వెనక్కి తిరిగితిరిగి చూస్తూ చరచరా వెళ్ళిపోయింది భద్ర.

౨

అప్పుడే పొద్దువాలింది.

పొలాలలో చెట్లకింద పడుకుని పశువులు నెమరువేస్తు న్నాయి.

పాలూ పెరుగూ అమ్ముకోడానికి పొరుగూళ్ళు వెళ్ళివుండిన గొల్లభామలు వెనక్కి మళ్ళివస్తున్నారు.

శంకరం సంపన్నగొల్ల.

ఇరవై యేళ్ళ వాడు.

ఈమధ్యనే స్త్రీలవేటకి ప్రారంభించాడు.

పిల్లంగోరుఒకటి చేతపట్టుకుని, మిథిలకు అరకోసు దూరాన దారికిచేరివున్న తన పశువులసాలలో కూచుని వున్నాడతను.

ఇంతలో వొకపిల్ల కంటబడింది.

"అదిగో వచ్చేసింది దుర్గ" అంటూ వెళ్ళి దారికడ్డంగా నుంచున్నా డతను. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ.

దుర్గ పద్దెనిమి దేళ్ళ పిల్ల.

అందక త్తె. ధీ రానూ.

శంకరాన్ని చూసి మొదట గతుక్కుమని ఆగి, అంతలో ధైర్యం తెచ్చుకుని వెనక్కి తిరిగి చూసి ముందుకి మెల్లిగా బయలు దేరి, నడుస్తూనే చెప్పులు వాొదులు చేసుకుంటూ దగ్గరికి వచ్చిందామె.

" ఎంత సేపణ్నుంచి కనిపెట్టుకున్నానో, దుర్గా, వచ్చావా? " అంటూ అప్తింవెళ్ళి గంప పట్టుకున్నా డతను.

" ఏమి టిది ? అంది దుర్గ చురచుర చూస్తూ.

" మన్మథవిలాసం. ఎరగవూ మరదలుపిల్లా? అటు, రేప ల్లెవాడలో కృష్ణు డయితే, యిటు మిథిలలో నేనూ, తెలి సిందా ? ఇదిగో నేనూ సంపాదించాను చూశావా ? " అంటూ పిల్లంగోరు చూపించా డతను.

" ఓహూో "

" నేను వూత్తాను నువ్వు పాడుదువుగాని, ఏం ? "

అప్పటికి మరో నయిగురు గొల్లభామలు సమీపించారు.

ముంగాళ్ళమీద నుంచుని చూసి " శంకరానికి మతిపో యింది " అంది వొకతె.

" దుర్గకి శివమూ వొత్తింది " అంది మరొకతె.

" పదవే, అంటే పదవే " అంటూ నలుగురూ పరుగు పరుగున బయలుదేరారు.

" పాట కేంలోటు, ఆటా ఆడతాను, నువ్వేం చూశావ్ ? " అంది దుర్గ.

అంటూనే గంపలందబెట్టి, చేపడంలోనే కుడిచేత్తో గోడకున్న కాలిచెప్పు తీసి "మరిపాడు" అంటూ శంకరం చెంపలమీద కొట్టసాగింది.

అప్పటికా గొల్లభామలు నలుగురూ దగ్గిరికి వచ్చి గంపలు దింపి శంకరాన్నిద్దరూ, దుర్గనిద్దరూ పట్టుకుని "ఏమిటి గొడవ?" అనడిగారు.

"అదు రేపల్లెవాడలో గొల్లభామల కందరికీ కృష్ణుడంట. ఇటు మిథిలలో మనకందరికీ యీతిక్క-శంకరయ్యేంట" అంది దుర్గ, యీసడిస్తూ.

"అబ్బో" అందొక గొల్లభామ.

"మనకందరికీపుస్తికడతాడటనా!" అంది మరో గొల్లభామ.

"అక్కజమేం, చక్కనయ్య కాదంటే?" అని సాగతీసుకుంటూ మరో గొల్లభామ శంకరయ్య బుగ్గలు పొడిచింది.

"తక్కువేం, మక్కువచూపవే" అని సాగతీసుకుంటూ మరో గొల్లభామ శంకరంనెత్తిమీద మొట్టింది.

"వెర్రికుదిరింది రోకలి తలకిచుట్టవే" అంటూ దుర్గ శంకరాన్నొక్క గెంటు గెంటింది.

అన్నీపడి, అన్నీతిని, శంకరం, పది అడుగులు పక్కగా వెళ్ళి మొగం వంచుకు నుంచున్నాడు.

"ఈమాటు దారికాశావంటే, తల అంటేస్తా" నంది పళ్ళు కొరుకుతూ దుర్గ.

"నాలుగుపొలిమేరలమధ్యా యీమాటలాంటి పని చేశావంటే ధప్పళం కాచేస్తా" నంది మరో గొల్లభామ.

"చంద్రమ్మకొడుక్కు నైయ్యాన్, ఎందుకూ? ఈమాటు ఎవర్తిని చూసయినా యికిలించావంటే - ఊఁ - తెలుసా?" అంది మరో గొల్లభామ, తర్జనితో టొకాయిస్తూ.

"మీరడ్డువచ్చారు మరి. లేకపోతేనా?" అంటూ దుర్గ గంప ఎత్తుకోగా "అప్పుడే అయిందంట తొందరపడకే. ఏదోవిధంగా పెళ్ళికావాలిగా యింకా?" అంటూ మరోగొల్లభామా, కిలకిల నవ్వుతూ తక్కిన గొల్లభామలూ గంప లెత్తుకుని బయలుదేరి వెళ్ళిపోయారు.

వాళ్ళలా కొంచెందూరం వెళ్ళేదాకా వోరచూపులు చూస్తూ మొగం వంచుకునే వుండి "ఏమిటి కిటుకు? ఎక్కడుంది?" అంటూ ఆలోచన ప్రారంభించాడు శంకరం.

"వాడికీ డబ్బుంది, మనకీ డబ్బుంది. వాడికీ వేలకొద్దీ ఆవు లున్నాయి, మనకీ వేలకొద్దీ ఆవు లున్నాయి. వాడూ చిన్నవాడు, మనమూ చిన్నవాళ్ళం; కాని వాడు కారునలుపు మనం పచ్చని దబ్బపండు. తెలివితేటలు చూస్తామా, మనమే నాలు గాకు లెక్కువగా చదివాం. అయినా, ఆడపిల్లలు వాడంటే పడిచచ్చిపోతారేం? మనం బతిమలాడినా మూతి ముడిచేస్తారేం? వాడికంటే మనమే గొప్పగా వూదేస్తాంగదా పిల్లంగోరు? మరెక్కడుందీ మాయ?"

నోరు తెరుచుకునీ, కళ్ళు మూసుకునీ వొక్కమాటు మొగం పైకెత్తుకునే టప్పటికి అతనికో దారి కనపడింది. "దొరికిపోయింది కిటుకు?" అంటూ మొగసిపడ్డా డతను.

"అద్దదీ, అద్దదీ. వాడిదగ్గిర బాపనయ్యవారు మంత్రాంగం

చేస్తాడు, మన కది తక్కువ, కనక, దినానికో శేరుపాలు, రెండు శేర్లు పెరుగు - వారానికి మూడు శేర్ల నెయ్యి - నెలకో బస్తా బియ్యం మనవి కావనుకుంటే లక్షమంది బాపనయ్యవార్లు. ఒక మెరికలాంటి వాణ్ణి చూసుకుని కృష్ణుణ్ణి అనిపించేసుకో వాల్సిందే ”

ఇలాంటి గొప్ప ఆలోచనతోచినందుకు పొంగిపోయి వొక మాటు వెన్ను విరుచుకుని, వొామాటు పిల్లంగోరు కూడా వూదేసి గబగబా యింటిదారి పట్టాడు శంకరం.

# 3

“ ఏంశంకరం రమ్మన్నావుటా?” అంటూ వచ్చాడు దేవదత్తుడు.

“ దణ్ణాలు దణ్ణాలు. మీాపని వచ్చిం దయ్యవారూ ” అంటూ కూచోడానికి తన పక్కని చోటు చూపిస్తూ కొంచెం జరిగాడు శంకరం.

ఆసనశుద్ధిగా కూచుని “ కాగితా లేమయినా - ” అని మాట తేల్చేశాడు దేవదత్తుడు.

దేవదత్తుణ్ణి ఆవూళ్ళో అందరూ దత్తయ్య అంటారు.

తనకి బదులు చెప్పకపోగా “ మీానాయన నీతో యిష్టంగా వుంటున్నాడా ? ” అనడిగాడు దత్తయ్య మళ్ళీ.

“ ఇష్టంకాక ? ” అన్నాడు శంకరం, ఈధోరణి అర్థంకాక.

“ అబ్బే, కొడుకులికి యీాడువచ్చినా యీా ముసిలాళ్ళు పెత్తనం విడిచిపెట్ట లేరులే. ఆవిధమైన చిక్కు ప్రతీయింటోనూ వుండనే వుంటుంది, చూశావ్ ”

"అదంతా లోకం సంగతి"

"ప్రతీవాడూ ఆలోకంలో వాడేగా ? కాని యీముసిలాళ్ళ దౌర్జన్యం చూశావ్ ? ఆ స్త్రీతమదిట. స్వార్థితంట మరి కొడుకులు ఈవాదంలో తమ కెలాంటిదెబ్బలు తగుల్తాయో వాళ్ళు చూసుకో రేమంట? మరి, తమకే చెందిన ఆ ఆ స్త్రీకీ ఆ కొడుకులికీ పోత్తుకలిపేసి తాముదూరంగా వుండిపో రేమంట?చూశావ్?"

ఇప్పు డవన్నీ నా కక్కర్లేని సంగతులు"

"వ్యవహారం అంతవరకూ వచ్చిందీ? నిజమే. ఆ స్త్రీమీద పెత్తనం వొక్కటే నీకు కావాలి. నే నెరగనూ?"

"అదికాదయ్యా, దత్తయ్యబాబూ"

"ఇది కాక, ఇంకా వున్నాయి గొడవలు?"

"రేపల్లెవాడలో కృష్ణు డున్నాడు చూడూ, ఇక్కడ మిథిలలో నే నలా అయిపోవాలి. అదీ సంగతి"

"కనక ?"

"వాడిదగ్గిర అయ్యవా రున్నాడు. నా దగ్గిరా వుండాలి"

"అదీసంగతి. విన్నావు? తెలివిలేనివాడిదగ్గిర పనిచెయ్యడం చాలా కష్టం. నువ్వు ఉన్న రహస్యం కనిపెట్టేశావు. ఇక చూసుకో నిన్నెలా తయారు చేస్తానో ?"

శంకరం తన పిల్లంగో చూపించాడు.

"చూశా. అతగాడి దగ్గిరా వుంది నీదగ్గిరా వుంది వెదురు గొట్టం. ఇక ఊపిరి వుందో లేదో చూసుకోవాలి"

"నే నూదినట్టు వా డూదలేడంట"

"అయితే, మూడో మేలు. ఇంకొకటి చూశావ్ ? అత

గాజు నల్లగా నిగనిగలాడతాను. నువ్వేమో పచ్చగా ధగ ధగలాడతావు. ఈ భేదం అతిసులభంగా తగ్గించి వెయ్యవచ్చు. నాకా ధైర్యం వుంది. చూడూ, నా ఆలోచన విన్నావా చెప్పుమా తెల్లమొగం వెయ్యడు తెలుసా ?"

"ఇక మనకీ మనకీ ఏర్పాటేమిటో — ?"

నవ్వి "ఇంకా కృష్ణుడువి కాలేదుగా ? అంచేతనే యీ తేలికతనం. విన్నావా ?" అనడిగాడు ముందు దత్తయ్య.

ఒక్కక్షణం చూసి చూసి "చూడూ, నీభారం అంతా నామీద వేసుకుంటున్నాను. మరి నా భారం?" అనడిగాడు మళ్ళీ.

"నామీద వేసుకోవాలి"

"ఇక నేం ? ఏర్పాట్లన్నీ చెయ్యి"

"దినుస్సంతా రేపు తెల్లవారాటప్పటికి మీ యింటికి పంపేస్తాగా ? ఉదయం అయే టప్పటికి నువ్వు నాపని మీద వుండాలి. అంతేనా ?"

"అంతేఅంతే. తెలివయినవాడెప్పుడూ తన భారంవొకరి మీద పెట్టడానికి ముందే వాణ్ణితృప్తిపరుస్తాడు. ఇంతకీ: నేను కృష్ణునిజీవితరహస్యంబాగా తెలిసినవాణ్ణి. అంచేత, నెల్లాళ్ళుగా అయిదారుగురు గొల్లయువకులు నన్నాశ్రయిస్తూనే వున్నారు. కాని యెవడిఆలోచన యెవడికిప్రాప్తంవుందో ? నువ్వు వర్తిస్తా నిస్తావని నేను కలలో అయినా అనుకున్నానా ? మరిపోతా"

"సరే"

ఇద్దరూ అరుగుదిగారు.

నడివీధిలోకి వచ్చాక, ఆగి, ఉపదేశముద్రపట్టి "విన్నావూ?" అనడిగాడు దత్తయ్య.

"ఏమిటి?"

"వచ్చినవాడే – నాకు – నచ్చినవాడే"

ఇలాపాడి, ఒక్కమాటు శంకరం కళ్ళల్లోకి గంభీరంగా చూసి "ముందిలాంటి పదవాఙ్మయం విజృమ్మొర్యాలి లోకం మీద. తెలుసా?" అనడిగి, వత్తయ్య వెళ్ళిపోయాడు.

"సుటికిపడే. ఇష్టకని పెట్టేశాను. రాజబాట కూడా వేసేశా డప్పుడే. ఇక చూసుకో కృష్ణుని పాట్లు?" అనుకుంటూ శంక రయ్యని యింటోకి వెళ్ళిపోయాడు.

౪

"పొలిమేరదాటికి వచ్చావుబాబయ్యా" అన్నాడు మంగలి వెంకట్రాముడు వంగి దండాలుపెడుతూ.

"అక్కడ వుండమని చెప్పావా?" అనడిగాడు దండపాణి.

"చిత్తం, బాబయ్యా, నేను మనవిచేసుకోనూ మనవి చేసుకున్నాను, చిన్నదొరగా రాగనూ ఆగాడు. అప్పటి కప్పుడే గుర్రంమీద విహారం చేస్తున్న మహారాజులుంగా రక్కడ కలుసుకుని చాలా ఆదరించారండి చిన్నదొరగారిని.

"సెబాస్! మరి లేవండయ్యా నాయుభ్యా" అంటూ లేచి నుంచున్నాడు కుంభకుడు.

అసలే చెయ్యెత్తుమనిషి అతను.

దీనికి సాయం చేతిలో నిలివడెత్తు నక్కపిల్లికర్ర.

కాళ్ళకి కిర్రుచెప్పులు.

గుప్పెడేసి మీసాలు.

నెత్తిమీద్ద, త్రిశూలంమీద నిలిచిన కాశీనగరం లాగ పట్టివర్ధనాల నానుకుని తెల్లని బుట్టపాగా.

హాలంతా నిండివుండిన గొల్లపెద్ద లంతా వొకయెత్తూ అత నొక్కడూ వొకయెత్తూగా వుంది అతని విగ్రహం.

అతని కుడిపక్కగా, అలాంటి వేషంతోనే అతని పినతండ్రి శతరథుడు కూచుని వున్నాడు.

అతను బాగా వృద్ధు; కాని, ఆకళ్ళు చూస్తే, లేస్తే మనిషి కా డని తోస్తుంది.

బోసినోరు. అయినా బుగ్గమీసాలు.

నడుము కొంచెం వంగిపోయిం దంతే.

లేచినవాడు లేచినట్టుగానే కుంభకుడు "బుల్లిబాబయ్యా, మీరు నడవలేరు, ఇక్కడే వుండిపోతారా బండి పూన్పించనా?" అనడిగాడు.

దానిమీద "ఏమన్నావ్ కుంభకం? నే నిక్కడే వుండిపోనా? లేకపోతే, బండిమీద రానా?" అని చురచుర చూస్తూ చినాలున లేచా డతను.

"మీరే మహా మొనగాళ్ళు. కదూ దండపాణీ! ముసిలాడికింద యెంచి యేమి లోతువ కట్టేశారయ్యా కుర్రాళ్ళు నన్ను? అబ్బో, మీరైతే మహా నడిచేస్తారు కామోసు. ఏదీ, నాతో సమానంగా అడుగు వెయ్యండి చూతాం" అని బోసినోరు చప్పరించుకుంటూ భూమి బద్దలయి పోయేటట్టు కర్రతో పొడుస్తూ, అడుగున్నూ వేశా డతను.

"అది కాదు మామయ్యగారూ, మన సిరిదాముడు

బహుమతీలన్నీ తానే గెలుచుకున్నాడా మరీ? అవన్నీ పట్టుకువచ్చి మీ పాదాలకి సమర్పించుకోవా లతను. అదీ కుంభకం బావగారి వుద్దేశం" అని సద్ది చెప్పాడు దండపాణి.

"హా - హ్హా. తలతీసి తలపెడతావ్ వ్యవహారాల్లో. అంచేతనే మా కుంభకం మాటల్లో లేసి అర్థం అతికించి బయటికి తీశావ్ సరేకాని, దండపాణీ! వేనవేల యెడ్లలో మన రాజాగిత్తలే బహుమతీ లన్నీ గెలుచుకున్నాయీ? అవన్నీ పట్టుకుని నా మనమడు దేవేంద్రుని కుమారుళ్ళాగ మహా వైభవంగా యింటికి వస్తున్నాడూ? ఎదురువెళ్ళి అతగాణ్ణి గుచ్చి కౌగలించుకోకుండా ఆడదానిలాగ యిక్కడ కూచుంటానుటయ్యా నేనూ? చాలుచాలు. నేర్చుకుపోయారు, పదండి పదండి గప్పాలుకొట్టక" అని మళ్ళీ తొందరపెట్టాడు శతరథుడు.

"ఒరే, గోవిందూ! అబ్బాయీ గిత్తలూ గుమ్మంలోకి వచ్చేటప్పటికి దిష్టితియ్యాలి, సిద్ధంగా వుండమని చెప్పు అమ్మ గారితో. హారతి సిద్ధంచేసుకుని వుండమని అమ్మాయితో కూడా చెప్పు. చూడూ, గుగ్గిళ్ళు సిద్ధం చేసి వుంచావా అప్పుడు దాలిమీద పడేస్తావా? వెర్రి మొగమా దిక్కులు చూడకి చెంగలిగడ్డిలో ముదురుపరకలు తీసేసి వెన్నపూసలాంటి లేతపరక లేరి గుంజలదగ్గిర వేసివుంచు" అని పెద్దపాలికాపుతో చెప్పి "మరి అడుగువెయ్యండి బుల్లి బాబయ్యా" అన్నాడు కుంభకుడు.

"మరి పూలదండలేవయ్యా?" అనడిగాడు శతరథుడు, దండపాణిని.

"ఒరే, పోతూ" అని పిలిచాడు దండపాణి, పక్కకి చూస్తూ.

రెండుగంపల పూలదండలు కావడితో తెచ్చి అక్కడ దింపాడు చాకలి పోతురాజు.

ముందు శతరఘునకొకటి, కుంభకున కొకటీ యిచ్చి, తర్వాత, తానొకటి పుచ్చుకున్నాడు దండపాణి.

వెంటనే అక్కడ వున్న గొల్లలందరూ తలో దండా పుచ్చుకున్నారు.

"ఒరే, వెంట్రాముడూ, నువ్వూ నాదగ్గిరగా నడు" అంటూ మంగలిని పిలిచి, దండ వాడిచేతి కిచ్చి, శతరఘునకు దర్జాగా బయలుదేరాడు.

అప్పటికప్పుడే వూరుదాటారు శంకరమూ సత్తెయ్యాను.

"నీగిత్తెల్నెందుకు తీసుకువెళ్ళావు కాదూ పందానికి?" అనడిగాడు సత్తెయ్య.

"పందానికి వెడితే నాగిత్తెలు గెలుస్తాయో, వోడిపోతాయో అదలా వుంచు. నేను వొకపిల్లమీద కన్ను వేశాను. మానాయన చాలాచాలా తొందరపెట్టాడు; కాని, నేను దానికోసం వూళ్ళో వుండిపోయాను" అని బదులుచెప్పాడు శంకరం.

"పనిజరిగిందా?"

"అది వేరేసంగతి"

"అయితే, అసలుసంగతి నేను చెబుతా విను.

"మరి కానియ్యి"

"నువ్వు నన్ను చేరదీశావు; కనక నావల్ల నువ్వు బాగుపడాలి"

"అందుకేగా నిన్ను చేర్చిందీ?"

"మరి నిన్ను నే నెందుకు నమ్ముకున్నానూ ?"

"పొట్టగడవడానికి"

"ఛా, చెప్పావు మాట" అంటూ గుర్నాసడించుకున్నాడు దత్తయ్య.

"మరెందుకో చెప్పు, చంపక"

"కృష్ణుణ్ణి నమ్ముకుని పొట్టమాత్రమే పోసుకుంటున్నాడా ఆబ్రాహ్మణుడు ?"

"బాగుపడ్డా డంటావా ?"

"నువ్వు కాదంటావా ?"

"ముందు నేను బాగుపడాలికదా దత్తయ్యా ?" అంటూ విసుక్కున్నాడు శంకరం.

"అది నాచేతిలో కాదుటయ్యా వుందంటున్నానూ, శంకరయ్యా ?" అంటూ అంతకంటే విసుక్కున్నాడు దత్తయ్య.

"కనక, ఏమంటావూ ?"

"ఏమనడానికీ యేమి వుందీ ? నీవల్ల నేను బాగుపడాలి" చూసి చూసి "బాగుచేసేస్తానయ్యా" అన్నాడు శంకరం.

"అలా అన్నావు బాగుంది. మరి విను. మనం సిరిదాముణ్ణి కలుసుకుంటాం. ఆమాటా యీమాటా వస్తుంది.

"నీగిత్తలముందు మాగిత్తలు పనికివస్తాయి. కనక, నా గిత్తల్ని అంచేత తీసుకురావాలే దనాలి నువ్వు"

"నేను లోకువయి పోనుటయ్యా దత్తయ్యా ?"

"ఎంతమాత్రమూ లోకువకావు, పైపెచ్చు, ఏకయి

వచ్చి మేకయి బిగిసినట్టు చివరికి సిరిదాముని నెత్తెక్కి కూచుంటావయ్యా శంకరయ్యా ''

"నిజంగానా ?" అనడిగాడు శంకరయ్య, యెదటికివచ్చి దత్తయ్యని నిలిపి.

"ఒక్క దెబ్బని"

"ఎలాగయ్యా, నమ్మేయ్యనా ?"

"అయ్యో, నీఅమాయకత్వం కూల్చేయ్యా, కుంభకం దొరగారి నీలమ్మని నీకిచ్చేటట్టు వారి కుచ్చులు పన్నుతున్నానయ్యా నేనూ, పడకొట్టుకుంటావుటయ్యా ?"

ముందు చకితుడైనాడు శంకరం.

తరవాత "మంచిమాటచెప్పావు" అంటూ యెగిసి పడ్డాడు.

"నువ్వంతవాడివే, నాకు తెలుసు. నేను కృష్ణునితో సమానం కావాలనుకుంటున్నాను; కాని నీలమ్మ కనక నాకు తక్కితే కృష్ణుడు నా దగ్గిర తీసికట్టే అయిపోతాడు మెచ్చానయ్యా" అంటూ చివరికి దత్తయ్యని కౌగలించుకున్నాడు.

"నేను చెప్పినట్టల్లా వింటూవుంటేనే, నేనేం చేసినా, తెలిసిందా ?" అని గట్టిగా అడిగి "మరి పద" అంటూ దత్తయ్య అడుగువేశాడు.

ఆలోచనలోపడి, శంకరం, తనకి తెలియకుండానే నడక ప్రారంభించాడు.

ఏమి టేమిటో ఆలోచనలు తోచాయి.

ఏమి టేమిటో లాభాలు కనపడ్డాయి.

దాంతో, దత్తయ్యఅంటే యెంతో అభిమానం పుట్టుకు వచ్చింది.

వెంటనే, అతను, మళ్ళీ ముందు కురికి దత్తయ్యని ఆపు చేసి "ఇదిగో చూడూ దత్తయ్యా, నువ్వు కనక నాకు నీల మ్మని పెళ్ళి చేయిస్తివట్టాయినా, నీకు నేను, నువ్వు కోరుకున్న సానిపిల్లని వొప్పగించేస్తానయ్యా" అంటూ వూగిపోయాడతను.

x

వీరందరూ వెళ్ళా టప్పటికి సిరిదాముడు వూరిబయటికి వచ్చి వున్నాడు.

అతనివెంట వచ్చినవారే చాలామంది. వారికి సాయం వూరివారున్నూ కొందరు వారిని కలుసుకుని వున్నారు.

శంకరమూ, దత్తయ్యాకూడా కలుసుకుని వున్నారు.

"జయ సిరిదామా!" "జయ మహావృషభపాలకా" అంటూ జయధ్వనులున్నూ పిక్కటిల్లిపోతున్నాయి.

దగ్గిరికి వచ్చీరావడంతోటే, సిరిదాముడు, మొదట పింతాత శతరథునకూ, తరవాత తండ్రి కుంభకునకూ, ఆతర వాత మేనత్త మొగుడు దండపాణికీ పాదాభివందనాలు చేశాడు.

వారున్నూ, వృద్ధానుక్రమంగా, వొక్కొక్కరే, వెంటనే అతణ్ణి కౌగిలించుకుని, పూలదండలు వేశారు.

తరవాత తక్కినవారున్నూ పూలదండలతో అతణ్ణి ముంచె త్తేశారు.

ఇది యిలాజరుగుతూ వుండగా పెద్దలు ముగ్గురూ గిత్తల దగ్గిరికి వెళ్ళారు.

అవి వరాసగా నుంచుని వున్నాయి.

ఏడుగి త్తలపక్కలా ముకుదాళ్ళు పట్టుకుని ఏడుగురు పాలి కాపులు నుంచునివున్నారు.

హిమాచలం, వింధ్యాచలం, శోణాచలం, భద్రాచలం, నీలాచలం, వేదాచలం, అంజనాచలం అని ఆగిత్తలికిముద్దు పేళ్లు.

అన్నీ పూలదండలలో మునిగివున్నాయి.

అన్నీ మదించిన యేనుగుల్లా వున్నాయి.

గిత్తలకున్నూ పెద్దలు పూలదండలు వేశారు.

ఇంతలో సిరిదాముడు వచ్చి "ఏడుగిత్తలకూ ఇవి వెండి మువ్వలు. ఇవి పసిడిగంటలు. ఇవిరత్నాలు పొదిగిన జయాఫల కాలు, ఇవి నాకిచ్చిన ఖడ్గమూ కటారీనీ" అని బహుమతు లన్నీ వేరు వేరుగా చూపించి పళ్ళెం శతరథున కందించాడు.

"సంతోషం నాయనా" అంటూ శతరథుడా పళ్ళెం కుంభకున కిచ్చాడు.

"బాగుంది నాయనా" అంటూ కుంభకుడా పళ్ళెం దండ పాణి కిచ్చాడు.

"నీకూ గిత్తలకూ తగిన బహుమతు" లంటూ దండపాణి ఆపళ్ళెం ఒకగొల్ల యువకున కిచ్చి "భద్రం" అని చెప్పాడు.

ఇంకా యెవరెవరివి గెల్చాయి నాయనా?" అనడిగాడు, అప్పుడు శతరథుడు.

"అన్నీ మనవే గెల్చాయి తాతయ్యా"

"నందుడు మామయ్యగారి గిత్తలు రాలేదుట కదూ?" అనడిగాడు కుంభకుడు.

"రాలేదు బాబయ్యా"

"సత్రాజిత్తు అన్నగారివో?"

"రాలేదు"

"వారయినా దయచేశారా?"

ప్రసేనజిత్తు బాబయ్యగారు మాత్రం దయచేశారు; కాని, తగవరిగావుండమని కోరితే వొప్పుకోలేదుట. సాత్యకిబావ వచ్చాడు; కాని విందులకూ రాలేదు. గిత్తలకేసీ రాలేదు, మన హయగ్రీవంమామయ్యగారివి నూరావులు బేరంచేసి వెళ్ళిపోయాడు"

"నీకు కనపడ్డాడా?"

"దూరాన్నుంచి మందహాసంచేసి వెళ్ళిపోయాడు"

"అక్రూరుడు కూడా విడిచేతులతోనే వచ్చాడటనే?" అనడిగాడు శతరథుడు.

"అవును. "ఏ" మని అడగ్గా" మీగిత్తలు వచ్చాక మరెవరికి ఆశవుంటుం" దని అడిగాడు"

"కృతవీర్యుడు ఆబెయ్యలు మాత్రమే తీసుకువచ్చాడట కాదూ?"

"అవేనా, రెండు తీసుకువచ్చాడు. రెండింటికీ బంగారపు గిన్నె లిచ్చారు. మనగిత్తలకు మొట్టమొదట పూలదండలు వేసినవాడు కృతవీర్యుడుబావే"

ఇది విని శతరథుడూ కుంభకుడూ మొగమొగాలు చూసుకున్నారు.

"నందుడు బావయ్యగారి శతకోటీ, దంభోళీ, వచ్చివుంటే— వోహ్హో, నెల్లాళ్ళయింది చూసీ. గిత్తలంటే అవే గిత్తలు" అన్నాడు కుంభకుడు.

"మరి సత్రాజిత్తు పెంచుతున్న మహేంద్రమూ, వజ్రగ్రీవమూనో? వాటిని చూస్తే కళ్లు చెదిరిపోవూ?" అన్నాడు శతరథుడు.

ఇది చూసి సిరిదాముడు చిన్నపుచ్చుకున్నాడు; కాని "యెక్కడో వున్న గిత్తలమాట యెందుకూ? తమ గిత్తలను చూస్తేమాత్రం కళ్లు చెదిరిపోడంలేదూ కుంభకం మామయ్యగారూ?" అని శంకరం అడగ్గా, మళ్లీ తేరుకున్నాడు.

"మరి నువ్వెందుకు తోలుకు వెళ్లావుగాదూ? నీ గిత్తల్లో నాలుగింటికి ఎక్కడయినా పోలిక వుందా?" అనడిగాడు కుంభకుడు.

"తమగిత్తలు వెళ్లాక మాగిత్తలు వెళ్లేం ప్రయోజనం మామయ్యగారూ?" అన్నాడు శంకరం.

సిరిదాముని మొగాన గర్వరేఖ మెరిసింది.

"మొదట పంపుదామనే అనుకున్నాడు శంకరం. కాని వద్దని నచ్చచెప్పి నేను మానిపించా" నన్నాడు దత్తయ్య, ఒక గొల్లయువకునితో అపవారించి.

"గిత్తల సంగతి నీకేం తెలుసు నయ్యాయ్?"

"తెలుసులే. అదేం బ్రహ్మవిద్యా?"

"పోనీగానీ, శంకరానికీ నీకూ ఎప్పణ్ణుంచీ స్నేహం?"

"స్నేహం కాదు, దిద్దమని దేవుళ్లాడాడు, వొప్పుకున్నాను"

గొల్లయువకుడు చకితుడై వూరుకున్నాడు.

ఇవతల, మరో గొల్లయువకుడు "నీకూ దత్తయ్యకీ సంబంధం యేమిటోయ్?" అనడిగాడు, అపవారించి శంకరాన్ని.

"గడవడంలేదని కాళ్లా వేళ్లా పడ్డాడు. నెలకో కావెడు

గింజలు పారబోస్తాను, కనిపెట్టుకుని వుండిపో అన్నాను" అన్నాడు శంకగం.

"మొత్తానికి ఈపందాలు ఏర్పాటు చేసిన దేవలకుడు పెడసరం మనిషి. ప్రయత్నాలు దండిగానే చేశాడు; గాని అంచేతనే రావలసినంతా రాలేదు" అన్నాడు దండపాణి.

"ఇంకెందుకూ? బయలుదేరండి, పందాలుగెలిచిన గిత్తల్ని చూడడానికి అమ్మాయి కనిపెట్టుకుని వుంది" అన్నాడు కుంభకుడు.

"మరి బయలుదేరండి" అంటూ శతరథుడు దారితీశాడు. వెంటనే "జయ సిరిదామా జయ"

"జయ హిమాచలం జయ"
"జయ వింధ్యాచలం జయ"
"జయ శోణాచలం జయ"
"జయ భద్రాచలం జయ"
"జయ నీలాచలం జయ"
"జయ వేదాచలం జయ"
"జయ అంజనాచలం జయ"

అని జయధ్వనులు చేసుకుంటూ అందరూ బయలుదేరారు.

## ౬

"పెరుగివ్వడానికి నీకే కాదు, అమ్ముకోడానికి నాకూ పొద్దెక్కిపోయిందివాళ. నేను వెళ్లాటప్పటి కావూళ్లో బాపనోరి భోజనాలయిపోతా యేందారో?" అంటూ విసుక్కుంది భద్ర.

చద్దన్నం తిని పెరుగుముంతలు పుచ్చుకోడానికి కుంభకుని యింటికి వచ్చింది భద్ర, గంప పట్టుకుని.

"నాదా తప్పు ?" అంటూ గభీమని ఆగి, మొగం వెనక్కి తిప్పుకుని పులుకూ పులుకూ చూస్తూ ముదలకించింది నీల.

"నీది కాదమ్మా, నాదే. మీ అన్నగారు బహుమతులు గెలుచుకువచ్చాడు, మా తమ్ముడు నాకేమి టేమిటో కానుకలు తెచ్చాడు. దానా దీనా నాకూ నీకూ కూడా వూపిరిసెలపక — "

"నీకేం, నీతమ్ముడికి అన్నిమర్యాదలూ జరిగించే వచ్చావు, మరి మా అన్నయ్యకి నేను మాత్రం చెయ్యవద్దూ ?"

"చెయ్యవద్దూ ? ఎంతమాటా ? గుమ్మంలోకి వచ్చా టప్పటికి హారతి యివ్వవద్దూ "

"అన్నీ సిద్ధం చేసుకునే వున్నాను కనక, నువ్వు దేవుళ్లాడి పోతావని యిలా వచ్చాను; గాని, లేకపోతే యినాళ నీతో మాట్లాడుదునా నేను ?"

"నిజమేనమ్మా నిజమే. కనక, త్వరగా యిచ్చి పంపె య్యమ్మా నీకు పుణ్యం వుంటుంది. ఇంతకీ: ఇక్కడ నువ్వు చేసే ఆలస్యం ఇలా వుండగా, అక్కడ కృష్ణు డెంత ఆలస్యం చేస్తాడో నాకు ?"

"అదేమిటి ?" అంది నీల, చకిత అయి.

"నిన్న నాదగ్గిర పెరుగు పుచ్చుకున్నాడమ్మా"

"ఏ కృష్ణుడూ ?"

"మీ బావమ్మా, యశోదమ్మ కొడుకు"

"మా బావ నీదగ్గిర పెరుగు పుచ్చుకున్నాడూ ?"

"ఏం, పుచ్చుకోక ?

"ఎక్కడ పుచ్చు కున్నాడూ ?"

"బీట్లో ?"

"ఎందుకు పుచ్చుకున్నాడూ ?"

"ఎప్పుడూ వెంటవుండే అయ్యావారు అత్తవారి వూరి నుంచి నడిచినడిచి నోరిగిరి పోయి వచ్చాడంట. ఆయనకి తన కోసం యశోదమ్మ పంపిన పెరుగిచ్చేసి, తాను నాపెరుగు –"

"పుచ్చుకున్నాడా ? నువ్వు మాబావదగ్గిర డబ్బులు పుచ్చుకున్నావా ;" అనడిగింది నీల, చురచుర చూస్తూ.

ఆ చూపుతో భద్ర వుద్రిక్త అయింది.

"చాలుచాలు, వూరుకోవమ్మా, నేర్చుకుపోయావ్" అంటూ మూతి ముడుచుకుంది; భద్ర.

"నువ్వే నుహామర్యాద యెరిగినదానవు" అని కూడా అందామె.

"పోసి, నాబావకి అమ్మకంపెరు గిచ్చావా మరి ?" అంది నీల, లాలనగా.

"అమ్మకం పెరుగు కాకపోతే మాదగ్గిర తాగడం పెరుగెలా వస్తుందీ ? ఎవరు మాత్రం, తనదగ్గిరలేని దివ్వగలరా యేమిటి ?" అంది భద్ర, రుసరుసలాడుతూనే.

"అదికాదు భద్రా" అంటూ భద్ర చెయ్యి పట్టుకుని ప్రారంభించింది నీల. "నీదగ్గిరవున్నదే నువ్విచ్చావు సరే; కాని మాబావ యెప్పుడయినా అమ్మకం పెరుగు పుచ్చుకుని యెరుగునా ? అందులోనూ, బాపనమ్మలికి పోసే అమ్మకం పెరుగా ? అవ్వ" అంటూ నోరు నొక్కుకుందామె.

"అవును నదే నాదగ్గిర వున్నది. అదయినా నువ్విచ్చిందే తెలుసా ?" అంటూ నిలవతీసింది భద్ర.

నీల మొగం వాలిపోయింది.

అతిప్రయత్నంమీాద మళ్లీ మొగం యెత్తుకుని "ఆచేతిలో యేమివుందోగాని, మీాయశోదమ్మత్త తోడుపెట్టిన పెరుగు అచ్చంగా అమృతంలా వుంటుంది. ఏమి చేసినీ యెవరూ ఆ రుచి తెప్పించలేరు. అలాంటి కమ్మని పెరుగు పుచ్చుకునే మాబావయ్యకి — పోనీ, అక్కడ నాపేరు రాలేదుకదా?" అనడిగింది నీల, ఆత్రంగా.

"అబద్ధం యెందుకూ? నీపేరు చెప్పే యిచ్చా"నంది భద్ర.

"అయ్యో, అయ్యో, నాకొంప తీశావు భద్రా! నేను చచ్చిపోతే నయం భద్రా" అంటూ కాలుకాలిన పిల్లిలాగ యిల్లంతా తిరిగింది నీల.

భద్ర ఆమె యింగితం కనిపెట్టసాగింది.

"సమయానికి అయ్యవా రెక్కడ దాపరించాడమ్మా నాపాలిటి యముడులాగా?" అంటూ మొత్తుకుంది నీల.

"తప్పుతప్పు, మీాబావమీాదే నీకభిమానం వుంటే, మీాభావ గౌరవించే అయ్యవారిని నువ్వలా అనవచ్చునా?" అనడిగింది భద్ర, ముక్కుమీాద వేలు వేసుకుని.

"అపరాధం, అపరాధం" అంటూ ముందు లెంపలు వేసుకుంది నీల. కాని, తరవాత "అయ్యవా రీసంగతి లోకం అంతా చాటేస్తాడేమో యేంచేతునమ్మా?" అంటూ చాలా దేవుళ్లాడింది.

"నేనిచ్చిన పెరుగు అయ్యవారే పుచ్చుకుంటానన్నాడు; కానీ—"

"కానీ అంటే?"

"నాకు నీలపెరుగే కావాలని కోరి పుచ్చుకున్నాడమ్మా మీా బావ"

"నీలపెరుగా?" అంటూ స్తబ్ధ అయిపోయింది నీల.

"అవును. నీల పెరుగంటే, నీళ్లుకలిసిన పెరు గని శ్లేష చేశా డమ్మా అయ్యవారు. కనక, నా కదే కావాలని —"

"అయ్యో అయ్యో, నన్నెంత యీసడిస్తున్నాడో మా బావయ్య, నన్నెంత హేళన చేస్తున్నాడో! అబ్బా, నాతల తిరిగి పోతోంది భద్రా!" అంటూ నీల చదికిలబడిపోయింది.

"కూచోఅమ్మా, కూచో, పోనీ, నావొళ్లో కూచో" అంటూ భద్ర, తన ఒళ్లోకి తీసుకుంది నీలని.

"ఈ అపరాధం యెలా పోతుంది భద్రా, వెళ్లి కాళ్ల మీాద పడనా?"

"తొందరపడకు తల్లీ, ఇవాళ యేమిజరుగుతుందో చూడనీ"

నీల గభీమని లేచి కూచుంది. "బతికించావు భద్రా!" అంటూ వుబ్బెత్తుగా లేచినిన్చుంచుంది. "ఇవాళ, నాకోసం తోడు పెట్టుకున్న పెరుగు ఆబంగారపు గిన్నెతోనే యిస్తాను పట్టుకువెళ్లు"

"అది బాగుందమ్మోయ్" అంది భద్ర.

"మా బావ అదిపుచ్చుకోడం కళ్లారా చూసి రావాలి సుమా! అయ్యవారి కివ్వకుండా చూడాలి సుమా"

"అలాగే, ఆలాగే, ఆపని మాత్రం జరగనివ్వను సరా?" అంటూ పొదువుకుని, భద్ర "అయితే, నీలా, ఆమాత్రం గ్రహించుకోలేదూ మీాబావా?" అనడుగుతూ కళ్లల్లోకి చూసింది.

భద్ర పొదిగిట నీల తేరుకుంది.

దాంతో "మూడేళ్లయింది మా బావయ్యనిచూసీ. ఇంటో మా రాధమ్మపిన్ని పెత్తనం. ఊరు కదలనివ్వ దావిడ" అందామె అప్రయత్నంగా.

"చూడాలని వున్నవాళ్ళుమాత్రం మహా కదులుతున్నారు కామోసు వూరు?" అంటూ గంభీరంగా చూసింది భద్ర.

నీల ఆచూపు తట్టుకోలేకపోయింది.

భద్ర తనగుట్టు గ్రహించేసిందా అని ఆమె భయపడింది.

ఇంతలో, వూళ్ళో, దూరంగా జయధ్వనులు పిక్కటిల్లుతున్నట్టయింది.

"బాబోయ్, మాఅన్నయ్య వచ్చేస్తున్నాడు, నీకు పెరుగిచ్చేస్తాను రా భద్రమ్మతల్లోయ్" అంటూ పాల గదిలోకి పరుగెత్తింది నీల.

గంప పట్టుకుని భద్ర ఆమెవెంట వెళ్లింది.

## ౭

అసలే ఆందోళపడిపోతున్న నీలకు ఈ జయధ్వనులు మరింత కంగారెత్తించాయి.

దాంతో, భద్ర కివ్వడానికి పెరుగు ముంతలున్న బీరువా తలుపు తీసీ కూడా "అవిగో కడవలు. నీయిష్టం వచ్చింది గంపలో పెట్టుకో" అంది భద్రని.

తెల్లపోయి "నాకు కడవ లెందుకమ్మా?" అంటూ సాగ తీసుకుంది భద్ర; కాని అది వినిపించుకోనట్టు "ముంతలు తీసుకోవేం?" అంది ఝూంకారంగా, భద్ర ఆలస్యంచేస్తున్నట్టు.

దానిమీాద, తనకి కావలసిన ముంతలన్నీ గంపలో పెట్టు కుని "మరివెళ్ళమ్మా, మీా అన్నయ్యకి హారతివ్వడాని కెంత ఆమర్దా పడిపోతున్నావో పాపం" అంది భద్ర.

"మరి గంప యెత్తాలా అక్కర్లేదా ?"

చూసిచూసి "నాకేం, పోనీ, యివాళ కూడా అమ్మకం పెరుగే యిస్తాను కృష్ణునికి. అతగాడు మధ్య నన్ను తప్పుపట్టడు గదా? మరి యెత్తమ్మా, యెత్తక పోతే యెలాగా ?" అంది భద్ర, కళ్ళు తిప్పుకుంటూ, వంగి గంపమీాద చేతులు వేసి.

"చూశావా, జ్ఞాపకంచేస్తే యేం భద్రా ?" అంటూ నిష్ఠురా లాడింది నీల.

"నేనేమో పానకంలో పుడకలాగ నీ ఆలోచనలకీ, నీ వ్యూహాలికీ, నీ సరదాలకీ అడ్డువచ్చినట్టు గంప యెత్తుకు పొమ్మంటున్నావాయె మరి, యింకెలాగమ్మా ?" అంటూ సాగతీసుకుంది భద్ర, అపవారించి కన్ను గీటుకుంటూ.

అందుకు బదులు చెప్పకుండా వెళ్ళి మరో బీరువా తెరిచి బంగారపు గిన్నె పట్టుకు వచ్చి యిస్తూ "పున్నమి వెన్నెల లాగా యెంత ధగధగలాడి పోతోందో చూసుకోమను ఆనల్ల నయ్యని" అంది మందహాసంచేస్తూ నీల.

"నువ్వూ నువ్వూ బాగానే వుంటారు, మధ్యగా నాతోనా వేళాకోళాలు ! నువ్విలా అన్నావా ? తాను దబ్బపండంత మిస మిసలాడుతున్నానని చెప్పడానికా యీాగిన్నెతో యిచ్చింది మాామరద లని అతగాడంటే? సెబాస్ నాచేతగాదు బాబోయ్ ఇక్కడి వక్కడా, అక్కడి విక్కడా అందించడం" అంది భద్ర. అతకంటే మందహాసంచేస్తూ.

అంతలో మళ్ళీ జయధ్వానులు వినవచ్చాయ్.

"బాబోయ్" అంటూ కంగారుపడింది నీల.

"గంప మెత్తడం మరిచిపోతావు సుమా" అంది భద్ర.

"మరి పద, మరిపద" అంటూ నీల గంపమెత్తింది, భద్ర వెళ్ళిపోయింది.

ఇంతలో "అన్నయ్య వచ్చేస్తున్నాడింకా రావేం నీలా?" అంటూ నీలతల్లి ధర్మద వచ్చింది కంగారు పడుతూ.

జయధ్వానులు మళ్ళీ వినపడ్డాయి.

దీంతో మరీ కంగారెత్తి పోయింది నీలకి.

వెంటనే, యేమి జరుగుతున్నదీ మరిచిపోయి "వచ్చెవచ్చె" అంటూ మరో పెరుగుముంత పట్టుకు బయలు దేరిం దామె.

"అదెందుకమ్మా?" అనడిగింది ధర్మద తెల్లపోయి.

"బా—" అని మొత్తుకుని, అంతలో తెలివిరాగా "గానే వుంది, నన్ను కంగారు పెట్టేస్తున్నావమ్మా" అంటూ ముంత బీరువాలో పెట్టేసింది నీల.

"తలుపులు మళ్ళీవచ్చి వేసుకోవచ్చు, ముందు హారతి వెలిగించు" అంది ధర్మద.

హారతి వెలిగిస్తూ "నీల పెరుగే కావాలంట ఆ నీలమేఘ శ్యాముని కి" అనుకుంది నీల.

తరవాత తొట్రుపడుతూ తల్లివెంట వెళ్ళిపోయింది.

౭

ధర్మదా నీలా వీధిలోకి వచ్చాటప్పటికి, గిత్తలతో కూడా వచ్చి సిరిదాముడు చీడీలకింద నుంచుని వున్నాడు.

శతరథు డొక అరుక్కీ, కుంభకు డొక అరుక్కీ చేరబడి వున్నారు.

రెండు పూలదండలు చేతపట్టుకుని దండపాణి సిరిదాము నకు పక్కగా వున్నాడు.

ఒక్కొక్క గిత్త దగ్గిర వొక్కొక్క పాలికాపు ముకుదాళ్ళు పట్టుకుని వున్నారు.

వెంట వచ్చినవారందరూ వీధి అంతా నిండి కళ్ళప్పగించి వూరుకున్నారు.

అక్షింతలపళ్ళెం పట్టుకువచ్చి పరిచారిక అందించగా ధర్మద, పచ్చ అక్షింతలూ యెర్ర అక్షింతలూ కొడుక్కి దిగతుడిచి పారబోసి, మరో పరిచారిక నీళ్ళు పొయ్యగా చేతులుకడుక్కుని, యింకో పరిచారిక గుడ్డఅందించగా చేతులు తుడుచుకుని, దండపాణి చేతవుండిన ఒక పూలదండ పుచ్చుకుని కొడుక్కి వేసి " గెలుచుకు వచ్చావా నాయనా ? " అంది.

సిరిదాముడు వెంటనే ఆమెపాదా లంటి కళ్ళ కద్దుకుని, చేతులు దోయిలించుకుని "అమ్మా నీఆశీర్వచనం నాకు గెలుపిచ్చింది. " అన్నాడు.

తరవాత, ధర్మద, గిత్తలదగ్గిరికి వెళ్ళి వాటికిన్నీ పచ్చఅక్షింతలూ యెర్రఅక్షింతలూ దిగతుడిచి పారబోసింది.

అప్పుడు, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వచ్చి, నీల, సిరిదామునకు ముందుహారతిచ్చి, తరవాత, దండపాణి చేతవుండిన రెండోదండ పుచ్చుకుని " గెలుచుకువచ్చావా అన్నయ్యా? అంటూ అతనికి వేసింది.

" గెలుచురాక ? మనగిత్తలు వెళ్ళినచోట మరొకళ్ళ

గిత్తలకే. గెలుపు ! అయితే, యీగెలుపంతా నాదికాదు, చివరికి నీది ” అంటూ పరిచారకుని చేతవుండిన బహుమతీల పళ్ళెం నీల కందించాడు.

“సంతోషం అన్నయ్యా, నీకింకా గెలుపు మీద గెలుపు రావాలి ” అంది నీల.

అని పళ్ళెం తల్లి కందించి, మళ్ళీ హారతిపళ్ళెం అందుకుని గిత్తల దగ్గిరికి బయలుదేరింది.

ఆవరసలో మొదట నీలాచలం వుంది.

దాని దగ్గిరికి వెళ్ళాటప్పటి కామెకి “నీలపెరు” గన్నమాట జ్ఞాపకం వచ్చింది.

దాని వెనకనే నీలమేఘశ్యాముడు కళ్ళకి కట్టినట్టయినాడు

అప్పటి కామె నాలుగో గిత్తదగ్గిర నుంచుని వుంది.

అప్రయత్నంగానే ఆమె గిత్తలకు అభిముఖంగా తిరిగింది; కాని గిత్తలకు బదులుగా ఆమెకి విశాలమైన చెంగలి బీడు కనపడింది.

“ఇది నీలపెరుగయ్యా ” అంటూ జయంతుడు, భద్ర యిచ్చిన ముంత దూరంగా తీస్తున్నాడు.

“నాకు నీలపెరుగే కావా ” లంటూ కృష్ణుడాముంత పుళాక్కుని నోటిదగ్గిర వుంచుకుంటున్నాడు.

అదిచూసి, పరవశ అయి, కృష్ణా, కృష్ణా, మానీలమ్మ మీాద నీకింత ప్రేమవుందా ? ” అంటోంది భద్ర

ఇంతలో, ఆపెరుగంతా తాగేసి “జయంతా, నీలపెరుగు రుచి నీ కేం తెలుసూ ? మూడేళ్ళయింది నేను మా కుంభకం మామయ్యగారి నీలని చూసి. అప్పటికే నీల మిల మిల్లాడి

పోతోంది. ఇప్పుడేతే అందాల కుప్ప అయివుందో ? ఎంతజాణ అయివుందో ? అప్పుడొకనాడు, ఏకాంతంగా కూచుని, ఒకపూల దండ కట్టి, అది సరిగా కుదిరిందో లేదో అని చూసుకుంటోంది. వెనకవాటుగా వెళ్ళి నేను కళ్ళుమూశాను. అదిరిపడి, నాచే తులు తీసెయ్యడానికి తనచేతులువిసురుగా యెత్తడంలో, కోరి వేసినట్టు ఆదండ నామెడలో పడింది. నేను పరవశు ణ్ణయిపో యాను. అలాంటి నానీలకి, నాకిప్పుడు పెరుగు లేకపోవడం తెలవకుండా వుంటుందా ? నానీలపంపిన పెరుగు నాకు అమృతం కాదుటయ్యా ?" అంటున్నాడు.

దీంతో నీల పరవశ అయిపోయింది.

ఆమెకళ్ళు మూతలు పడ్డాయి.

చేతులు, హారతి పళ్ళెం విడిచేసి గుండెల మీదవాలాయి కాని పళ్ళెం కిందపడిఘల్లుమనేటప్పటి కామె ప్రకృతిలో పడింది.

తల్లి "అదేంతల్లీ, అదేంతల్లీ ?" అంటూనేవుంది.

పరిచారిక పళ్ళెం పైకితీస్తూనే వుంది.

సిరిదాముడు తెల్లబోతూనే వున్నాడు.

"ఏం, గిత్త ముట్టె ఎగరవేసిందా ?" అంటు న్నాడు కుంభకుడు.

"చేతికి వేడితగిలిందా ?" అంటున్నాడు శతరథుడు.

"ఎవరి చెయ్యయినా తగిలిందా ?" అంటున్నాడు దండ పాణి.

కాని సిగ్గుపడిపోయి, యిక అక్కడ వుండలేక, వూచలాగ యింటోకి చక్కాపోయింది నీల.

"బహుమతులు కొట్టుకువచ్చిన తనగిత్తల్ని చూశాటప్ప

టికి ఆనందం పురకలు వేసుకొచ్చిందయ్యా” దాంతో, వాళ్ళు తెలవలేదయ్యా పాపం” అన్నాడొక గొల్లయువకుడు.

“అంతే, అంతే. ఆగిత్తల్లో తన పేరింటిది కనక నీలాచలం అంటే నీలకి ప్రాణం. దాన్ని చూశాటప్పటికి పరవశ అయి పోయింది పాపం. ఇంకేం వుందీ? పళ్ళెం జారిపోయిం” దన్నాడు ఇంకో గొల్ల యువకుడు.

“పైత్యం చేసి వుంటుం” దన్నాడు దత్తయ్య.

“అంతే అంతే, లేకపోతే, నీల పళ్ళెం ఒదిలేస్తుందా? నే నెరగనూ?” అన్నాడు శంకరం.

“మరోపళ్ళెం పట్టుకువస్తుంది, వుండండయ్యా” అన్నాడు మరో యువకుడు.

“రాదురాదు, సిగ్గుపడిపోయింది నీల” అన్నా డింకో యువకుడు.

“అయినా సరే, మళ్ళీవచ్చి గిత్తలికి హారతివ్వవలసిందే” అన్నాడు మరో యువకుడు.

కాని, “హారతి కేం, తరవాతయివ్వవచ్చు, నీల పెంచినవేగా గిత్తలు? పదండి పదండి, కట్టెయ్యండిరా కట్టెయ్యండి” అంటూ శతరథుడు పాలికాపులను తొందర పెట్టాడు.

౬

వెళ్ళివెళ్ళి ఒకగదిలో చతికిలబడింది నీల.

“నా నీలా, ఇంత దయవున్నదానవు ఒక్కమాటు రమ్మని కాకి చేత వర్తమానిస్తే వచ్చి నీపాదాలదగ్గిర పడివుండక పోదునా?” అంటూ కృష్ణుడు వెన్నంటి వచ్చిన ట్టయి, తప్పిం

చుకుంటున్నట్టు కుంచించుకు పోతూ కళ్ళు మూసుకుం దామె.

ఇంతలో "ఏం తల్లీ, ఏం మామ్మా" అని ఆదుర్దా పడుతూ వచ్చి, ధర్మద, ఆమెని పొదువుకున్నట్టుచుని "పళ్ళేం జారిపోయిందా తల్లీ? వొణుకుతున్నా వేమమ్మా?" అనడిగింది కంగారుపడుతూ.

"అంజనందగ్గిర నుంచున్నా నంతే. తరవాత ఏంజరిగిందో యెరగనమ్మా" అంది నీల, గది నాలుగుమూలలూ చూస్తూ అక్కడికి రావడంకూడా తా నెరగనట్టు.

"ఏమయినా బాధగా వుందా?"

"లేదు"

"పడుకుంటావా?"

"ఊహూ"

ఇంతలో "యేమయిం దమ్మగారూ?" అంటూ యిద్దరు పరచారికలు వచ్చారు, ఆత్రంగా.

అందులో ఒకతె రెండో దాన్ని "నువ్వు విసనకర్రతీసుకు రావే" అంది; కాని "మీరంతా బయట వుండండి. పిలుపు వినబడేటంత దగ్గిరగా వుండండి, అంతే" అని ధర్మద వాళ్ళని పంపేసింది.

వాళ్ళలా వెళ్ళగానే "చిట్టితల్లి యెలావుందీ?" అంటూ కుంభకుడూ, "బుల్లెమ్మ యేమిచేస్తోందీ?" అంటూ శతరథుడూ వచ్చారు తహతహ లాడుతూ.

అది విని "అమ్మా, రావద్దనవే" అంది నీల, మెల్లిగా, మొగం పక్కకి తిప్పుకుని.

"అక్కడేవుండండి కాస్సేపు, సిగ్గుపడిపోయింది బిడ్డ"

అంది ధర్మద, గుమ్మంకేసి చెయ్యూపుతూ, కాని "యేం చెల్లీ, యేంచెల్లీ?" అనడుగుతూ దూసుకు వచ్చేశాడు సిరి దాముడు, తల్లి మాట వినిపించుకోకుండా.

వెంటనే "దణ్ణాలన్నయ్యా! క్షమించు అన్నయ్యా! తల తిరిగినట్టయిం దంతే నేనేమీ యెరగ నన్నయ్యా!" అంటూ పడి పడి దణ్ణాలు పెట్టింది నీల, నేరం చేసిన మనిషిలాగ ప్రాధేయపడుతూ.

దానిమీద "వెర్రిచెల్లీ, భయపడకమ్మా" అన్నాడు సిరి దాముడు, ఆమె ముంగుర్లు సవరిస్తూ; కాని, ధర్మద "చెల్లాయి సిగ్గుపడిపోయింది అవతల వుండు నాయనా" అనగా "ఎందుకూ? అయోమయావస్థలో జరిగి పోయినదాని కెవ రేం చేస్తారూ?" అంటూనే వెళ్లిపోయాడు.

"ఏం, యెలావుందేమిటి?" అంటూ యింతలో దండపాణి వచ్చాడు.

"అబ్బే, పైత్యం ప్రకోపించిందేమో, తల తిరిగిందంట అంతే" అన్నాడు శతరథుడు: "అక్కడేవుండు" అన్నట్టు చెయ్యూపుతూ.

"కసిన్ని పాలచుక్కలు పుచ్చుకుంటావా అమ్మా" అన డిగింది ధర్మద.

"వద్దమ్మా" అంది నీల.

"పోనీ, కాస్త మజ్జిగ?" అన్నాడు శతరథుడు.

"ఏమంటావు తల్లీ?" అని రెట్టించింది ధర్మద.

"పట్టుకురా," అంది నీల, అతి నీరసంగా వున్నట్టు కళ్ళు తేల వేసుకుంటూనూ, నిట్టూర్పు విడుస్తూనూ; కానితన బంగా

రపుగిన్నె సంగతి బయట పడిపోతుందేమో అని భయపడి, అప్పటి కప్పుడే గుమ్మందాకా వెళ్లి వుండిన తల్లితో " వద్దమ్మా మజ్జిగ వద్దు " అంది కంగారుగా.

" కసింత పుచ్చుకోతల్లి "

" అయితే, మజ్జిగ వద్దు పాలచుక్కలే పట్టుకురా " అంది నీల, కళ్ళుమూసుకుని, గోడకి తల ఆన్చుకుంటూ.

" కసింత చక్కెర వెయ్యనా ? "

" ఊఁ "

" తొరకతో తీసుకురానా ? "

" ఊఁ "

" నీరసంగా వుం దంతే, ఏమీ భయంలేదు. మీరంతా వెళ్ళండి " అని పురుషులకు చెబుతూ ధర్మద పాలకోసం వెళ్ళింది.

" వైద్యుడిపని లే దనుకుంటా " అన్నాడు దండపాణి.

" అబ్బే, ఒక్కక్షణానికి గిత్తలదగ్గిరికి వెళ్ళి వాలదూ, పాల చుక్కలు వొంటడి తే ? " అన్నాడు శతరథుడు.

దానిమీద "రండిరండి" అంటూ కుంభకుడు దారితియ్యగా " పాలచుక్కలు పుచ్చుకుని ఒక్కక్షణం పడుకోమ్మా " అని శతరథుడూ " అవునవును, కాస్సేపు నిద్రపోతే అంతా చక్కబడుతుం " దంటూ దండపాణీ " అవును చెల్లీ పడు కోమ్మా, ఈలోపున యేటికి తీసుకువెళ్ళి గిత్తల్ని కడిగించి తీసుకువస్తా " నంటూ సిరిదాముడూ బయులుదేరారు.

అప్పటి కప్పుడే " నేను దగ్గిరే వుంటాగా ? అగత్యం అయితే

వర్తమానిస్తాను, వెళ్ళండి" అంటూ పాలు పట్టుకుని ధర్మద చక్కా వచ్చింది.

గిన్నె చూస్తూనే "చాలా తెచ్చావమ్మా అంది నీల.

"రెండు గుక్క లుంటాయి, అంతేనా?"

"గిన్నెడు తెచ్చి" అంది నీల, గారాంగా.

"పోనీ, యెంత కావలిస్తే అంతే పుచ్చుకో తల్లీ" అంటూ గిన్నె చేతి కందించింది ధర్మద.

మీాద చెయ్యవేసి దగ్గిరే కూచుని వుంది తల్లి; కాని గిన్నె నోటి దగ్గిర పెట్టుకునే టప్పటికి, తానూ కృష్ణుడూ బీట్లో ఆలమందకి దగ్గిరగా కూచుని వున్నట్టూ, చిరునవ్వు నవ్వుతూ యీపాలగిన్నె తానూ, "ఇదిగో, చెబుతున్నాను. గబగబా పుచ్చుకోగూడదు. మధ్య మధ్య మాట్టాడుతూ వుండాలి. చివరి కెవ రాలస్యంగా పుచ్చుకుంటే వాళ్ళకి ముచ్చెం మూడుముద్దు" లని బెల్లిస్తూ తన బంగారపుగిన్నె కృష్ణుడూ నోట పెట్టుకుంటున్నట్టు తోచిం దామెకి.

దాంతో చకితఅయి గిన్నె కింద వుంచేసింది.

"ఏంతల్లి, యేం?" అంది తల్లి ఆత్రంగా.

"వేడిగా వుందమ్మా" అంది నీల, నీరసంగా.

కామోసు ననుకుని "ఇలా తే అమ్మా" అంటూ గిన్నె పుచ్చుకుని "యీా కాస్త వేడి కే? ఇంకా వేడిగా వుండా లనే దానవు కాదు టె తల్లీ?" అంటూ ధర్మద పాలు వూదసాగింది.

"పాలు కాదమ్మా వేడి, గిన్నె" అంది నీల విసుగ్గా.

ఊది వూది "యింక పుచ్చుకో అమ్మా" అంటూ గిన్నె మళ్ళీ చేతి కిచ్చింది ధర్మద.

తల్లి పాలు వ్రాత్తున్నంతసేపూ వోరకంట చూస్తూ చిరునవ్వు నవ్వుకుని, ఆమె గిన్నె అందించా టప్పటికి మళ్ళీ నీరసం నటిస్తూ పుచ్చుకుని, తల్లి మళ్ళీ మీద చెయ్యి వేసు కూర్చోగా, ఒక్కమాటు బెదిరిబెదిరి చూసి, కళ్ళు మూసు కుని గిన్నె నోటపెట్టుకుంది నీల.

పాపం, కళ్ళు మూసుకున్నా, ఆమెకి కృష్ణుడే కనపడు తున్నాడు. కృష్ణుని సరాగాలుతప్ప లేదు.

గిన్నె తీసి దూరంగా వుంచి, కృష్ణుడు తన కళ్ళమీద ముద్దుపెట్టుకున్నట్టు, అలకలు దువ్వినట్టూ అయిం దామెకి.

కళ్ళు తెరిచి చూసింది.

"ఏం తల్లీ ?" అనడిగింది ధర్మద.

నీల మూలిగి వూరుకుంది.

"వద్దుమొర్రో అన్నా నిన్న సాయంత్రం వూరంతా తిరిగి వచ్చావు. పోనీ అంటే అమ్మవారు తల్లి దర్శనం చేసుకో కుండా మూడు సంధ్యలూ ముళ్ళు పడ్డాక దుడుగూ దుడుగూ యింటికి వచ్చేశావు, చెబితే వింటూరా యీకాలపు పిల్లలు ? దీపాలు పెట్టనీ, కింక నీళ్ళు పారబోయిస్తాను" అంది ధర్మద.

నీలకి నవ్వు వచ్చింది; కాని ఆపుకుని "అస్తమానమూ మూలకూచుని ముగ్గిపొమ్మంటావు. ఎవళ్ళపిల్ల లయినా కూచుంటున్నారా? నిన్న సాయంత్రం కొలనిగట్టున వందమంది పిల్లలం చేరుకున్నాం. అందరి కంటే నేను బాగా పాడతాను కనుక నన్ను కృష్ణుడు బావని చేసి, ఇంచక్క అందరూ రాస క్రీడ చేశారు. ఎంత బాగుందో అది" అంది కళ్ళు తిప్పుకుంటూ.

"అయితే, కృష్ణుడు బావని పెళ్ళాడతావా తల్లీ ?" అనడిగింది ధర్మద, మొగం మీద మొగంపెట్టి.

"ఛో" అంది నీల, ముంగోపం నటిస్తూ.

"యశోదమ్మ వదిన ఎంత మంచిదీ ? నిన్ను కిందఅడుగు పెట్టనిస్తుందా ?"

"ఛో"

"పెళ్ళయితే రాధతో మాట్లాడతాడా కృష్ణుడు ? ఎరగడా యేమిటి ? జ్ఞానం వచ్చింది మునపటిలా కాదంట యిప్పుడు"

"ఛో అమ్మా"

"ఇప్పటికీ అన్నం కలిపి నేను ముద్ద నోట పెట్టాలి నీకు. యశోదమ్మ వదిన కూడా అలాగే చేస్తుందిలే అమ్మా. నువ్వంటే యెంత ప్రేమో ఆవిడికి ?"

"అబ్బా ! అయితే, నేను పాలుపుచ్చుకోను" అంటూ ముతి ముడుచుకుని గునిసింది నీల.

"అయితే, తాతయ్య నిప్పుడే పంపేస్తాను రేపల్లెవాడ. నువ్వు పాలు పుచ్చుకోడమో మానడమో ఆకృష్ణుడే చూసుకుంటాడు వచ్చి"

పొంగి పోయింది నీల; కాని "చూశావా ?" అంటూ మూలిగింది.

"పాలు పుచ్చుకో మరి"

"అయితే, నువ్వు మాట్లాడకు మరి"

"ఊఁ"

"నాకేసి చూడకు మరి"

ధర్మద మొగం వంచుకుంది.

నీలకి ధైర్యం వచ్చింది. వెంటనే తన యెడమచేత తన భుజంమీద వున్న తల్లియెడమ చెయ్యి పట్టుకుని, ముసిముసినవ్వులతో తల్లికేసి ఓరచూపులు చూస్తూ, మధ్యమధ్య కళ్ళుమూసుకుని కృష్ణుని సాన్నిధ్యం అనుభవిస్తూ పాలు తాగేసి గిన్నె కిందపెట్టేసింది నీల.

వెంటనే ధర్మద తన పమిటికొంగుతో ఆమె పెదవులు తుడిచి "పడుకుంటావా కాస్సేపు?" అనడిగింది.

"అక్కర్లేదమ్మా" అంటూనే లేచి నుంచుంది నీల.

"తూలి పడిపోతావు తల్లోయ్" అని కంగారు పడుతూ లేచి ధర్మద ఆమెని పొదివి పట్టుకుంది.

"నువ్వు పాలకడవలు దాలిమీద పడేయిస్తావు కాదూ, అక్కడ నీదగ్గిరే కూచుంటాను పద" అంది నీల.

దాని మీద "వాకిట యెవరే? భ్రమరా! చూడమ్మా, పాల సావిట్లో కవాచీమంచంవాల్చూ" అంటూ నీలని మెల్లిగా నడిపించుకు వెళ్ళింది ధర్మద.

౧౦

"కృష్ణా! నారన్న నా పెరుగుముంత ఆవులచేత తొక్కించేశాడు చూడూ" అంటూ శ్రీదాముడూ, "కృష్ణా! శ్రీదాముడు ఆవులు తిరిగే మోకాలిలోతుగడ్డిలో పెరుగుముంత పెట్టి పైగా నాతో కొట్లాడుతున్నాడు చూడూ" అంటూ నారాయణుడూ వచ్చి కృష్ణునితో చెప్పుకున్నారు.

అప్పటికే ఒకరాతిమీద చలిదిచిక్కమూ పెరుగుగిన్నె

వుంచి, మరో రాతిమీద కూచుని వేణుగానం చేస్తున్నాడు కృష్ణుడు.

"ఏమి ?" టనడిగా డతను గానం మానేసి.

శ్రీదాముడూ నారాయణుడూ మళ్ళీ ఆమాటలే చెప్పారు.

"ఏమి జరిగింది ?"

"తిందా మని చద్దన్నం తెచ్చుకుంటున్నాను కృష్ణా! ఇంతలో ఆవూ ఆవూ కుమ్ముకుంటూ వుండగా విడిపించివద్దా మని చిక్కమూ ముంతా వున్నచోట పెట్టేసి వెళ్ళానంతే"

"ఆవులు తోలుకుని నే నిప్పుడే బీట్లోకి వస్తున్నాను కృష్ణా! ఇంతలో నీ వేణుగానంవినిపించింది. కదల్లేకపోయాను. అక్కడ ఆవు లేంచేశాయో మరి ?"

ఇద్దిరి వాదమూ విని "కనక ?" అన్నాడు కృష్ణుడు.

"తప్పు నారన్నది. కనక, వాడి పెరుగుముంత నా కిప్పిం చెయ్యి కృష్ణా !" అన్నాడు శ్రీదాముడు.

"తప్పు శ్రీదామునిది. ఇంటికివెళ్ళి మళ్ళీ మరోముంత తెచ్చుకోమను కృష్ణా" అన్నాడు నారాయణుడు.

వినివిని, చూసిచూసి, తలపంకించి "తప్పు నీదీ కాదు, నీదీ కాదు, నాదీ" అన్నాడు కృష్ణుడు.

నారాయణుడు శ్రీదామునితో "చూశావా ?" అన్నాడు టూకాయించి.

శ్రీదాముడు నారాయణునితో "విన్నావా ?" అన్నాడు ఝూంకారంగా.

"నారాయణా, నువ్వు వెళ్లిపో. శ్రీదామా, నువ్వు నాపెరుగు గిన్ని పట్టుకు వెళ్లి చద్దన్నం తిను" అన్నాడు కృష్ణుడు.

"అదేమిటి కృష్ణా ?"

"మాట్టాడ వద్దు. పట్టుకువెళ్ళు. అంతే"

శ్రీదాముడు కృష్ణుని పెరుగు గిన్ని పుచ్చుకునిబయలు దేరగా నారాయణుడు వెంటపడ్డాడు.

కృష్ణుడు మళ్ళీ వేణుగానం ప్రారంభించాడు.

దూరాన, పెరుగుగంప నెత్తిమీద పెట్టుకుని గబగబా వస్తోంది భద్ర.

కొంతదూరం వెళ్ళాక "యశోదమ్మ గిన్నినిండా మీగడే పంపిస్తుంది. నాకూ నీకూ చెరిసగం. ఏరా శ్రీదామా!" అన్నాడు నారాయణుడు, బెల్లిస్తూ.

"ఆ, రమ్మన్నారు తిమ్మన్న బంతికి" అన్నాడు శ్రీదాముడు.

"అదంతా నువ్వు తినలేవురా"

"నాకిది యేమూలకిరా ?"

"నాకు నో రూరుతోందిరా"

"నాకూ నో రూరుతోందిరా"

"కనక చెరిసగం పంచు" అన్నాడు నారాయణుడు, అడ్డం వచ్చి.

"ఫోస్" అంటూ తప్పించుకు బయలుదేరాడు మళ్ళీ శ్రీదాముడు.

"ఇదిగో అబ్బాయ్! నువ్వు నామీద కృష్ణునితో అబద్ధాలు చెప్పావ్"

"ఇదిగో అబ్బాయ్, చేతనైతే నువ్వూ నామీద చెప్పుకో"

"అబద్ధా లాడినవాడు ఒక్కడూ తింటే జీర్ణం కాదబ్బాయ్. ఆలోచించుకో"

"అబద్ధా లాడకపోతే తేరసామ్ము జీర్ణం కా దబ్బాయ్ ఇప్పు డయినా తెలుసుకో"

"నువ్వా-" అంటూ గిన్ని పుళాక్కో-బోయాడు నారాయణుడు.

తప్పించుకుని, తర్జనితో టాకాయిస్తూ "ఇదిగో, గిన్నె ముట్టుకున్నా వంటే బాగా జరగ దబ్బాయ్, యేమనుకున్నా వో" అన్నాడు శ్రీదాముడు.

"ఇదిగో, గిన్ని కింద పెట్టకపోతే బాగా జరగ దబ్బాయ్ ఏమనుకున్నా సరే" అన్నాడు నారాయణుడు మళ్ళీ టాకాయిస్తూ.

ఇదంతా చూసి "పెరుగిచ్చినట్టే యిచ్చి, యిద్దరికీ తగువు పెట్టి, యిదేమీ యెరగనట్టు వేణు వూదుకుంటున్నాడు కృష్ణుడు, ఏమి జాణఅన్నా?" అనుకుంటూ నిలిచి పోయి బుగ్గలు నొక్కుకుంది భద్ర.

"ఒరేయ్, ఆపెరుగు ఒక్క గుక్కెడయినా నీకు తక్కనివ్వనురా". అన్నాడు నారాయణుడు.

"ఒరేయ్, ఈపెరుగు ఒక్కచుక్క అయినా నీకుచిక్క నివ్వనురా" అన్నాడు.

"అయితే ఆగు"

"మరి నుంచో"

"కలియబడదాం"

"కుమ్ముకుందాం"

"సంయే"

"సంయే"

"అయితే, ముందు మాటలతోనా చేతలతోనా ?"

"ముందు మాటలతోనే"

"మరి చూసుకో"

"మరి కాసుకో" అని పెరుగుగిన్నె దూరంగా పెట్టి వచ్చి, శ్రీదాముడు "కాని మాటలు రానిచ్చావంటే ?" అంటూ వురిమి చూశాడు.

"పెరుగు మిగల్చకపోయావంటే ?"

"నీకు పెరు గెలావస్తుందిరా మీఆవు లిరవయ్యే, మావి ముప్పయి"

"నీకు పెరుగెలా మిగుల్తుందిరా మీవి యిరవై ఆవులు వొట్టిపోయాయి, మావి పదిహే నావులుపాలిస్తున్నాయి"

"మీ అమ్మ సగానికి సగం నీళ్ళు కలుపుతుంది పాలలో"

"మీ అమ్మ మూడువంతులు నీళ్ళు కలిపేస్తుంది పాలలో"

"మీ ఆవుల పాలు పల్చన, వెన్న రాదు"

"మీ ఆవుల పాలు చప్పన, తాగలేం"

"మీ అమ్మ వెన్నె అమ్మేస్తుంది"

"మీ అమ్మ అరగాగునెయ్యే అమ్మేస్తుంది"

"మీ అమ్మ నిమ్మకాయ పిడిచి, రాజమార్గంలో కూచుని, కానికీ అర్ధణాకీ మజ్జిగనీ ళ్ళమ్ముతుంది"

"మీ అమ్మ ఉప్పూకలిపి పడవల రేవులో తిరుగుతూ దమ్మిడీకీ ఏగాణికీ పుల్లమజ్జిగ నీ ళ్ళమ్ముతుంది"

"నీకళ్ళు నెత్తికి వచ్చాయ్"

"నీకళ్ళు మూసుకుపోయాయ్".

"ఇక సహించను"

"ఇక భరించను"

"ఇక నీ ఆటలు సాగవ్"

"ఇక నీ గప్పాలు చెల్లవ్"

"హరహరా"

"మహాదేవా"

ఇద్దరూ చెయ్యీ చెయ్యీ కలుపుకోబోయే టప్పటికి మరో నలుగురు గొల్లపిల్లకాయలు వచ్చారు.

అది చూసి నారాయణుడూ శ్రీదాముడూ ఎడం యెడంగా నుంచునారు.

"ఒరేయ్, ముందు గిన్నె జాగ్రత్తపెట్టరా" అన్నాడు వచ్చినవాళ్ళలో పెద్ద, మరొకనితో.

శ్రీదాము దడ్డువెళ్ళగా, ఆపెద్దవాడు శ్రీదామున కడ్డు వెళ్ళాడు.

తెల్లపోయి నుంచుని "ఏమిటి నువ్వనేది?" అన్నాడు శ్రీదాముడు.

"నువ్వనే దేమిటి?" అన్నాడు పెద్దవాడు.

"గిన్నె నాది"

"ఒరేయ్, పెరుగు మనం పంచుకుని గిన్నె శ్రీదామున కిచ్చేద్దాం రండిరా"

"నాపెరుగుముంత కూడా పంచుకుందాం నన్ను కూడా చేర్చుకోండిరా" అన్నాడు నారాయణుడు.

"నువ్వేం కష్టపడ్డావోయ్ యిందులో?"

"మీరు వచ్చేదాకా వాణ్ణి ఆపుచేశానోయ్ దారిలో"

"అయితే, వొప్పుకున్నాం, రా"

"నారంగా, యశోదమ్మ పంపిం దంతా మీాగడే. మా అమ్మ యివాళ పల్చని మజ్జిగ యిచ్చింది పెరుగు మిగలక. పంచుకోండి" అని వాళ్ళనెక్కిరిస్తూ మెల్లిగా అని నారాయణుడు వాళ్ళ వెంట పడ్డాడు.

చూసి చూసి "ఒరేయ్, నాకు కీసవాటా అయినా పెట్టండిరా మరీ" అంటూ బిక్క మొగం వేసుకుని, కాళ్ళీడ్చుకుంటూ వాళ్ళ వెనకాల పడ్డాడు శ్రీదాముడు.

## ౧౧

"పెరుగోయమ్మ పెరుగు" అని మెల్లిగా పాడుతూ, సుతారంగా నృత్యంచేస్తూ, దారిలోనే నుంచుంది భద్ర, కృష్ణుని కేసి చూస్తూ.

"హాయ్ హాయ్, నా వేణునాదం కంటే మధురంగావుంది నీ కంఠస్వరం. ఏదీ యిలా రా భద్రా" అని సాదరంగా పిలిచాడు కృష్ణుడు, వేణుగానం మానేసి.

దగ్గిరికి వచ్చి, గంప దింపుకుని, చనువుగా కూచుని, "మొదట అందర్నీ గొప్పచేస్తావు; కాని చివరి కందర్నీ నీ గుప్పిట్లో యిరికించేసు కుంటావ్, యెక్కడ నేర్చావు కృష్ణా, యీా జాణతనం?" అనడిగింది భద్ర, చిరునవ్వు నవ్వుతూ.

"నాజాణతనం నువ్వేమెచ్చుకోవాలి"

"ఏం తక్కువ కృష్ణా?"

"నీతో వాదం యెందుగ్గానీ, పోనీ, వున్నదే అనుకో

అయితే, లోకువయినవాళ్ళు దొరికితే నేర్పగలవా ళ్ళూరుకుంటారా మరీ?"

"ఎందుకూరుకుంటారూ? ఏయిల్లా లయినా సాహసిస్తుంది చివరికి" అంది భద్ర, కళ్ళు తిప్పుకుంటూ.

"సాహసిస్తుం దనకు భద్రా, దయతలుస్తుందను. నిన్న నాకు పెరుగులేని లోటు తీర్చావు నువ్వు, దయవుంది కనక నేనా?" అని బెల్లిస్తూ చూశాడు కృష్ణుడు.

"దయా? నీమీదా? నాకా? ఎంతమాట అన్నావు కృష్ణా? నాచేతులు పడిపోనూ, నిన్న నేను నీకు అమ్మకంపెరుగిచ్చాను తరవాత యెంత దేవుళ్ళాడితే మాత్రం యేమి లాభమూ?"

"ఎందుకూ? నిన్న నాకు పొడిమెతుకులు తినే దురదృష్టం తప్పించినందుకా?"

"నువ్వు ముందరి కాళ్ళకి బంధం వేస్తావు; కాని నా యాతన నీ కెలా తెలియజెప్పగలనూ? నాతో కుదిరిందా? ఇలాజరిగిందని యాదాలాభంగా చెప్పేటప్పటికి మాకుంభకం నాయసింగారి నీల యెంత కుంగి పోయిందో —"

"శివశివా! విడ్డూరాలు చెబుతున్నావు భద్రా నువ్వు"

"లేదు కృష్ణా, లేదు. ఈసంగతి విని —"

"ఆమె కెందుకు వినిపించావు భద్రా?"

"వినిపించాలని వినిపించానా? మాటమీద మాట వచ్చింది చివరికి నానోరు జారింది. ఇది విని, సుడిగాలిలో ఏలకితీగె మెలికలుతిరిగి పోతుంది చూడూ, అలా అయిపోయింది ఆముద్దరాలు. చూడలేకపోయాను, కృష్ణా"

"విని నే నేమయిపోతున్నానో యెరుగుదువా? మా

మామయ్యకూతురు నా మూలంగా అలా అయిపోయిం దంటే నేనెంత క్రూరుణ్ణి ?"

"శ్రీహరీ, శ్రీహరీ! ఎదురుపన్నుతున్నావా కృష్ణా ?"

"నీకలా తోచిందా భద్రా? మూడేళ్ళ కిందట ఏమి జరిగిందో యెరుగుదువా మరి ?"

"ఏమి జరిగింది కృష్ణా.?"

"నీమనసులో వుంచుకుంటా నంటే —" అంటూ కృష్ణుడు చెయ్యి చాపాడు.

"నా నల్లగుండెల్లో దాచుకుంటాను నమ్మి కృష్ణా" అంటూ ఆచేతిలో చెయ్యి వేసి గిల్లింది భద్ర.

"నమ్మి భద్రా, నీదగ్గిర దాచలేకుండా వున్నాను. నీల రజస్వల అయినప్పుడు మేము ఇంటిల్లపాదిమీ వెళ్లి వారందినాలుండినాము. 'దూడలు చెడిపోతాయి, నేను రానుగాక రా' నన్నాను; గాని మాఅమ్మా, మారాధమ్మఅత్తా బలవంతంచేసి —"

"మా నీలకంటే నీకు దూడ లెక్కువా కృష్ణా?"

"ఆమాటకివస్తే నాకంటే కూడా నాకు దూడలే యెక్కువ. నీల చక్కని చుక్కే — కావచ్చు; కాని, నేనెప్పుడయినా రెండుకళ్ళా చూస్తేనా ?"

"అయ్యో కృష్ణా ?"

"అలా అన్నావూ? అలా అనుకుంటూ నే నెంత పరితపిస్తున్నానో యిప్పుడు ?"

"సరే, వారం దినాలుండినారు"

"ఇక తెల్లవారితే రేపల్లెవాడకి వచ్చేస్తాం. మాబళ్ళు

వచ్చేశాయి. బహుమతీలున్నూ అయిపోయాయి. జాముస్నర రాత్రి అయింది. ఇంకా నిద్ర రాలేదు; కాని కళ్ళుమూసుకుంటే సుఖంగామాత్రంవుంది. దక్షిణపు తెరపిలో పొన్న చెట్టుకింద పడుకుని వున్నాను, ఏం తోచిందో పాపం, అలాంటప్పుడు మెల్లిగావచ్చి, నీల, మల్లెమొగ్గలదండ నామెడలో వేసి, నేను నిద్రలో వున్నాను కదా అన్న ధైర్యంతో నన్నుచూస్తూ నుంచుంది. నేను గభీమని చెయ్యిపట్టుకుని, లేచి కూచుని, నానీలని నావొళ్ళోకి తీసుకుందామని చూశాను; కాని పెనగులాడింది. గునిసింది. గదిమింది. అమ్మా అంటూ పిలవబోయింది ఎలా విడిపించుకుందో మెరుపయిపోయింది. కాని, భద్రా, ఏమి శరీరమూ అదీ? వెన్నపూసలాగ మార్దవం అబ్బిన బంగరు సలాక కాదూ? అలాంటి నానీల అంత కష్టపడ్డ దంటే—"

"కష్టమన్న కష్టమా కృష్ణా? ఇదిగో, దీన్ని బట్టి నువ్వాది గ్రహించుకో వచ్చు" అంటూ, గంపలోనుంచి బంగారు గిన్ని తీసి అతని కందించింది భద్ర.

అది చూసి కృష్ణుడు చకితుడైనాడు.

అదిపుచ్చుకుని పరవశుడున్నూ అయిపోయాడు.

"భద్రా" అనిపిలిచి, మరి మాట్లాడ లేకపోయా డతను.

"తెలిసిందా కృష్ణా? నిన్న నేను అమ్మకంపెడుగిచ్చినందుకు—అది నాకు తానిచ్చిందే కనక, ఆవిధంగా తానేనీకు అమ్మకంపెడుగిచ్చినట్టయింది కనక — ఆ అపరాధం మరిచిపొమ్మనీ, తనని క్షమించమనీ—"

"నేను మేలుకునే వున్నానా భద్రా?"

"కృష్ణా ! నీకు అపచారమూ, నీలకు అపకారమూ చేసి నదాన్ని నేను—"

"భద్రా, నాకు మాటలు రావడంలేదు. నువ్వు ఆపార్వతీ అమ్మవారువిగాని, పెరుగమ్మ్మకునే – "

"అంతమాట అనకు కృష్ణా !"

"అనక మానను. లక్షమాట్లంటాను. కోటిమాట్లంటాను. ఏమీ యెరగనట్టు ఇది పెరుగంటావు నువ్వు. కాదు నా నీల ప్రేమ. ఇది బంగారపు గిన్నె అంటావు నువ్వు. కాదు ప్రేమతో నిండివుండిన నీల హృదయం. నానీల – "

"తథాస్తు. ఆమాటమీద నిలు కృష్ణా !"

"నిలుస్తాను. నిలిచేవున్నాను. ఇప్పుడా? మల్లెమొగ్గల దండ వేసినప్పుడే మీనీల నానీల అయిపోయింది"

"మరి నువ్వు? నువ్వు ఏమయినావు కృష్ణా? నామీద ఆగ్రహం వద్దు – "

"ఆగ్రహం యెందుకూ? నే నేమయినానో ఆభగవంతునికి తెలుసు. నీలే కనక పరాయిపిల్లఅయితే యిన్నాళ్ళా? నామేన మామకూతురయిపోయింది. మాఅత్తయ్య ప్రోత్సహించాలి, మా మామయ్య యివ్వాలి, నేను శిరసావహించాలి. వా రెందు కూరుకున్నారో?"

"నువ్వు కనిపెట్టనే లేదా?"

"కనిపెట్టి యేమి లాభం? ఇందులో వొక చిక్కు కూడా వుంది.

"అదేమిటి కృష్ణా?"

"మాబావ సిరిదాముడున్నాడు చూడూ. అతనికి నే నంటే కిట్టదు"

"అలాగటయ్యా? అంత మొనగాడా సిరిదాముడు! కృష్ణా, ఇది నీలకి తెలుసా?"

"తెలియదని చెప్పలేను; కాని, భద్రా, నేను తలుచుకుంటే సిరిదాముడు నాకొక అడ్డా? కాని సాహసిస్తే కుటుంబ వైరం — తరతరాల వైరం ప్రారంభం అవుతుంది. మాఅమ్మకి పుట్టిల్లు దూరం అవుతుంది —"

"అదలా వుంచు, కృష్ణా! ఇందుకు దారిలేదూ? నీల బంగారపు గిన్నె యెందుకు పంపిందో నాకిప్పుడు అర్థం అవుతోంది. వెర్రిపిల్ల నీల అలా నలిగిపోవలసిందేనా?"

"అక్కర్లేదు, తొందరపడకు; కాని నే నొకందుకు ఎదురు చూస్తున్నాను"

"అదేమిటి కృష్ణా?"

"అడక్కు భద్రా! నాచేత చెప్ప ననిపించకు భద్రా"

"నన్ను నమ్మవూ కృష్ణా?"

"నమ్మనూ? నమ్మక యే చెరువునీళ్ళు తాగుతానూ? భద్రా! ఇంతవరకూ నే నేసుందరికోసమూ దీనుణ్ణి కాలేదు. ఇకముందున్నా కాను. కాని నీలకోసం నేను అటమటించిపోతున్నాను. నిన్ను నమ్మాను. పూర్తిగా నమ్మాను. అంచేత నే నీ కీసంగతిఅయినా చెప్పాను"

"చాలు కృష్ణా చాలు. నేను ధన్యురాలను"

"కాని ఈసంగతులు నువ్వు నీలకు చెప్పవద్దు"

"చెప్పకుండా వుండగలనా ? ఎంతమంచిపిల్ల కృష్ణా నూ నీల ?"

"కనక, ఆమెకి అపకారం చేస్తా నంటావా ?"

"అమ్మో"

"ఊరుకో. ఈపెరుగూ — ఈమీగడా — కళ్ళకి ఒద్దుకుని పుచ్చుకుంటాను. ఈసంగతి మాత్రం నీలకు చెప్పు. అయితే, నేను వ్యర్థుణ్ణి. ద్రోహినిమాత్రం కాను. ఈసంగతి కూడా నా నీలకు చెప్పు"

"సరే, కృష్ణా, ఇక పదిమాట లెందుకూ ? నాసంగతి నీకు తెలుసు. నేను నాబతుకు తెరువు చూసుకోవాలి —"

"అయ్యో, భద్రా ! నిన్నెంత సేపు కూచోబెట్టానూ ?

"అందువల్ల నే నేమీ చెడలేదు. కృష్ణా ! పైగా, నా హృదయం ఆనందంతో నిండిపోయింది. మరి పోతా. ఆగిన్ని నీదగ్గిరే వుంచు, మళ్ళీవచ్చి తీసుకుపోతా"

మాట ముగించకుండానే లేచి భద్ర గంపనెత్తుకుంది. గంప యెత్తుకోడంలో భద్రకి సాయంచేసి కృష్ణుడు "నీకోసం యెదురుచూస్తూ వుంటా" నన్నాడు.

"క్షణంలో రానూ ? ఇటున్న పొద్దు అటుతిరిగా టప్పటికి నీ పాదాలదగ్గిర వాలనూ ? కృష్ణా, మరి పోతా" అంటూ పదడుగులు గబగబా వేసింది భద్ర.

కాని, తరవాత, వెళ్ళలేక వెళ్ళలేక, వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ, పదిగజాల కోమాటు ఆగిపోతూ, కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళింది.

౧౨

"ఓహ్హో, ఏమి గెలుపులురా విజయా! ఒక్కటయినా తప్పిపోకుండా అన్నీ మనకే వచ్చేశాయి లోకేమిట్రా? చాలు, నాజన్మ కిది చాలు. ఏరా, విజయా! ప్రపంచకం పుట్టాక — అందులో మన గొల్లకులం పుట్టాక — అందులోనూ మళ్ళీ యెడ్లపందాలు పుట్టాక గెలుపు లన్నీ వొక కమతగానికే రావడం నువ్వు చూశావా?" అనడిగాడు గోవిందు, సగర్వంగా ఎదురొమ్ము విరుచుకుంటూ.

ఏనుగిత్తులకూ ప్రత్యేకంగా వొకసావడి.

ఆసావిట్లో, ఏనుగిత్తులనూ ప్రత్యేకశ్రద్ధతో మేపే ఏనుగుల పాలికాపులు.

వాళ్ళందరిమీాదా పెద్ద గోవిందు.

గోవిందు, కుడితిగోలెం అంచునా, తక్కిన ఏనుగులూ కింద చెదిరిచెదిరీ కూచుని వున్నారు.

గిత్తలేమూ వరాసగా పడుకుని నెమరు వేస్తున్నాయి.

వీరభద్రుడూ, విజయుడూ ఆయేనుగులిలోనూ గోవిందు రెండుభుజాలు.

"ఎక్కడా చూడలేదురా" అన్నాడు వీరభద్రుడు.

"ఎక్కడయినా జరిగివుంటేనా ఎవళ్ళయినా చూడడానికి? హే" అంటూ తల యెగరవేసుకున్నాడు గోవిందు.

"అయితే, ప్రపంచం పుట్టినప్పణ్ణుంచీ వీరభద్రుడు పుట్టి కట్టుకు వూరేగుతున్నాడటనా?" అనడిగాడు వీరభద్రుడంటే కిట్టని రామభద్రుడు.

కానిమీాద “నే నూరేగుతున్నానో లేదో నువ్వు చూశావటనా, పోసీ?” అని టోకాయించాడు వీరభద్రుడు పులుకూ పులుకూ చూస్తూ.

“ఏడుగిత్తులగెలుపూ వొకయెత్తూ, ఒక్క వీరభద్రుని యీావొక్క యెదురు ప్రశ్నా వొక యెత్తూనూ. కొట్టండిరా చప్పట్లు కొట్టండి” అంటూనే చప్పట్లు కొట్టాడు విజయుడు.

కాని, యెవరూ కొట్టలేదు.

“ఏం, వీరభద్రుడు గెల్చుకుంటే చప్పట్లు కొట్టరేం?” అనడిగాడు గోవిందు, రుసరుసలాడుతూ.

“కొట్టండిరా, కొట్టండి. నేనోడిపోయాను. వీరభద్రుడు గెల్చుకున్నాడు. వాడి ప్రశ్న చాలా గొప్పదే” అన్నాడు రామభద్రుడు.

అందరూ కొట్టారు.

“ఆ, అదిగదీ మాట. చూశారా? మనకి సత్యమే కావాలి. ఈ విశాల భూ — ఆకాశ — అంతరాళ — ప్రపంచకంలో ఎప్పుడూ అసత్యమే గెలుస్తుంది. అయితే, ప్రపంచకం మాయ. అబద్ధం. దగా. కనక, మనకి సత్యమే కావాలి. రామభద్రుడు సత్యం వొప్పుకున్నాడు. మెచ్చాను. వీరభద్రా! జయం నీది. అయితే, విజయూ, ఏమన్నావూ? ఏడుగిత్తలగెలుపూ, ఒక్కవీరభద్రునిగెలుపూ సమానమా? ఛూ! గిత్తలముందు మనిషి లొడితెడు. ఒప్పుకోను. ఒప్పుకోజాలను”అన్నాడు గోవిందు, ఆవేశంతో.

“ఒప్పుకోడానికి వల్లకాదు. ఒక్కగిత్తతోకంత పొడు

గయినా లేడు వీరభద్రుడు. విజయుడు తప్పే "చేశాడు"
అన్నాడు రామభద్రుడు.

"అద్గదీమాట. ఈమాట జయం రామభద్రునిది. కొట్టండి
చప్పట్లు" అన్నాడు గోవిందు, తానుకొడుతూ.

కాని, యెవరూ కొట్టలేదు.

"ఏం, కొట్టరేం? నేను పెద్దపాలికాపుని. మీరేమగురూ
నాచేతికింద బతుకుతున్న వాళ్ళు"

గోవిందుమాట కష్టంవచ్చి "ఆపాట్న ఆగు" అన్నాడు.
భీముడు.

"ఆగాను" అన్నాడు గోవిందు.

"ఒరేయ్, మనం, మనమీద గోవిందు పెత్తనం సాగిస్తేనే
మనం గిత్తలమీద పెత్తనం సాగించుకోడానికి వీలుంటుంది.
కనక, కొట్టండేస్" అన్నాడు మళ్ళీ భీముడు.

అందరూ కొట్టారు.

"ఈమాటు భీముడి కిచ్చేశాను జయం" అన్నాడు
గోవిందు.

ఒక్క వీరభద్రుడుతప్ప తక్కిన అందరూ "కొట్టండిరా,"
అంటే "కొట్టెయ్యండిరా" అంటూ చప్పట్లు కొట్టారు.

చూసిచూసి "నేను చప్పట్లు కొట్టలేదు. ఎవడూ కని
పెట్టలేకపోయాడు. నాకు మళ్ళీ జయం వచ్చేసింది" అన్నాడు
వీరభద్రుడు, చప్పట్లు కొట్టబోయినీ ఆగి.

"నేనిచ్చేశాను నీకు జయం. నువ్వు నాకుడిభుజానివి.

నాకు తప్ప నిన్ను తప్పొపట్టడానికి మరెవడికీ అధికారం లేదు"
అన్నాడు గోవిందు.

అప్పుడు సిరిదాముడూ, అతని మిత్రుడు శంకరమూ వద్దాగావచ్చి యీమాటలు వింటూ మౌనంగా నుంచున్నారు. పాలికాపులు వారిని చూడలేదు.

అక్కడ, వొక్కదూకున ముందుకివచ్చి "గోవిందూ, నాకూ వొక జయం కావాలి. కనక, నేనూ మాట అనేస్తాను" అన్నాడు విజయుడు, తల యెగరవేసుకుంటూ.

"మొదటిజయం నాది కదా? తరవాత, ఎవడెన్ని జయాలు కొట్టుకుపోయినా నాకిబ్బంది లేదు. కనక, అనెయ్యరా, జంకకు" అని ప్రోత్సహించాడు వీరభద్రుడు.

"నువ్వు నాయెడమభుజానివి. నీకూ కూడా వొక జయం లేకపోతే అది నా కేలోటు. కనక, నీకూ జయం యిచ్చేస్తాను. ఆమాట యేదో అనెయ్యి" అని సెలవిచ్చాడు, గోవిందు.

సిరిదాముడూ శంకరమూ మొగమొగాలు చూసుకుని నవ్వుకున్నారు.

"ఇదిగో, అందరూ వినుకోండి. రేపల్లెవాడనుంచి నందుడు దొరగారి దంభోళీ, శతకోటీ వచ్చివుండినా గెలుపులన్నీ మన గిత్తలవే. బహుమతీలన్నీ మన సిరిదాముడుదొరగారివే. మరి యెవడు కాదంటాడో —"

మాటసగంలో అడ్డువచ్చి "ఆగు, మెప్పంతా మనగోవిందుదే, అనికూడా కలుపు, లేకపోతే నేనొప్పుకోను" అన్నాడు గోవిందు.

"మెప్పంతా —"

"ఆగు, అలా కాదు, మళ్ళీ మొదట్నుంచీ అనాలి"

"పద్నాలుగు మా ట్లంటాను, నా కేంభయమా? ఇదిగో అందరూ వినుకోండి. రేపల్లెవాడనుంచి నందుడుదొరగారి దంభోళీ, శతకోటీ కూడా వచ్చివుండినా గెలుపులన్నీ మన గి త్తలివే. బహుమతీలన్నీ మన సిరిదాముడు దొరగారివే. మెప్పంతా మనపెద్దపాలికాఫు గోవిందుదే. మరి యెవడు కాదనగలడో రమ్మను చూస్తాను" అంటూ మీసం దువ్వి తొడ చరుచుకున్నాడు విజయుడు.

"మళ్ళీ ఆగు" అన్నాడు గోవిందు.

"ఆగాను"

"దంభోళి ఏమిచెయ్యగలదూ?"

"జంభాలు నరగ్గలదు"

"సెబాస్, నాకుడిభుజం వీరభద్రా, నువ్వూ, శతకోటి యేమిచెయ్యగలదూ?"

"రామకోటి రాయగలదు"

"శేష్! కొట్టండి, కొట్టండి" అన్నాడు గోవిందు, తాను కొడుతూ.

అందరూ కొట్టబోయారు.

చేతులెత్తారు; కాని "దొరగారురా" అన్నాడు రామ భద్రుడు, మెల్లిగా.

అందరూ గతుక్కుమనిపోయి, చేతులుదించేసి, వెనక్కి తిరిగి నుంచున్నారు.

"చాలా గొప్పమాటలు విన్నాం, కదూ బావా?" అన్నడిగాడు శంకరం.

"అవునుగానీ, ఇందాకా, పూరిబయట, మాబాబయ్య కూడా వాటిమాట తెచ్చారు. అవిగొప్పగిత్తలే, కాదనడానికి వీలులేదు; కాని అవి వచ్చివుంటే మాగిత్తలు గెలవలేకపోవు నంటావా?" అన్నాడు సిరిదాముడు,

"ఒక్కనాటికీ నేనామాటఅనను. ఏమంటే? మనవి ఏనుగిత్తలోయ్. లెక్కరెండుగిత్తలేంచెయ్యగలవు బావా?"

"ఎదటిశక్తి గుర్తించకపోలేదు; గాని, నాకూ అలాగే తోస్తోంది. మాగిత్తలు కోరచూపులు చూశాయంటే — రాక్షసులు ఉరిమిచూస్తున్నట్టుండదూ?"

"నింపాదిగా అడుగుతున్నావా? కృష్ణుడే తట్టుకోలేడు ఆచూపులు. అతనిగిత్తలా ఆగుతాయి?"

"ఏమయినా, ఈసంగతి ఇటోఅటో తేలిపోతేగాని బాగా లేదు. అన్నిపందాలూ మాగిత్తలేగెలిచినా మాబాబయ్య అలా అనడం నాకు చాలా బాధగావుంది"

"ఏదోవంకపన్ని వొకమాటుకలపటం చేసెయ్యవోయీ, ఆలోచనయెందుకూ?"

"నీకూ అలాగేతోచిందికదా, ఇక ఆగను. నాలుగయిదు దినాలలో తేల్చేస్తాను, వింటావుగా?"

ఇంతలో నీలవచ్చింది.

శంకరం మొగం విప్పారింది.

"ఏం చెల్లీ?" అన్నాడు సిరిదాముడు.

" బాబయ్యా, తాతయ్యా కనిపెట్టుకునివున్నా రన్నయ్యా' ఇల్లంతా వెతుకుతోంది అమ్మనీకోసం. వడ్డన అయిపోవచ్చింది'.

" బావా, మరిపోతా, మధ్యాహ్నం రా మాట్లాడు కుందాం " అన్నాడు సిరిదాముడు.

" వెళ్ళి భోజనం చెయ్యి "

ముందు నీలా, తరవాత సిరిదాముడూ ఇంటోకి వెళ్ళారు.

" నీలని దాటిపోనివ్వగూడదు. ఈవిధంగాకూడా మనం కృష్ణుణ్ణి వోడించెయ్యాలి " అనుకుంటూ శంకరం బయటికి వెళ్ళాడు.

పాలికాపులికి ప్రాణాలు లేచివచ్చాయి.

" విన్నారేమో ? " అన్నాడు విజయుడు.

" వింటే అడగలేదేం ? " అన్నాడు వీరభద్రుడు.

" శంకరందొర తిరుగుతున్నాడెందుకూ మనదొరగారి వెంటా ? " అన్నాడు గోవిందు.

" గొప్పోళ్ళూగొప్పోళ్ళూ కూడాకూడానూ తిరుగుతూ వుంటారు, గోతులూతవ్వుకుంటూ వుంటారు మనకెందుగ్గానీ, మనంకూడా కాస్త కాస్త భోజనంచేసి బీట్లోకిపోదాం లేవండిరా " అన్నాడు రామభద్రుడు.

" అవు " నంటే " అవు " నంటూ అందరూ వెళ్ళిపోయారు.

## ౧౩

" నిరుత్సాహంకాకపోతే, వుత్సాహంమెలావస్తుంది దొరగారూ నాకు ? " అన్నాడు, పెద్దపాలికాపుసింగన్న.

"అదేమిరా?" అనడిగాడు నందుడు.

"ఎన్నివిధాల ప్రార్థించినా నాకోరిక మన్నించకపోతిరి, యేలినవారు. చెప్పకేం, బహుమతీలన్నీ కుంభకందొరగారి గిత్తలేకొట్టెయ్యడం నాకు తలకొట్టేసినట్టుంది బాబయ్యా?"

"విన్నావా కృష్ణా?" అనడిగాడు నందుడు.

చల్లబడ్డాక, దినమ్మూ, బీట్లోకివచ్చి పశువుల నన్నిటినీ చూడడం నందుని నిత్య కృత్యాలలో వొకటి.

దంభోళినీ, శతకోటినీచూసి, దువ్వి, ఆనందించడంకూడా అతనికి తప్పనిసరి నిత్యకృత్యం.

అలాటప్పుడు కృష్ణుడు అతని వెంట వెంటనే వుంటూ వుంటాడు.

ఆవేళ బలరాముడుకూడా నందునితోవచ్చాడు.

జయంతుడు సరేసరి.

నందుడు, దంభోళికీ శతకోటికీ మధ్యగా నుంచుని, వొకదాని మీాద చెయ్యివేసి, మరోదానిమీాదికి వాలి నుంచునివున్నాడు.

"ఏరా, మనగిత్తలు మట్టుకేనా వెళ్ళంది?" అనడిగాడు కృష్ణుడు.

"మనవేకాదు, పేరుపడ్డ గిత్తలేవీ వెళ్ళలేదంట దొరా"

"ఇంకేం? చెట్టులేనిచోట ఆముదపుచెట్టే మహావృక్షం. పాడిలేనిచోట గొడ్డుగేదే శివాలక్ష్మి. పేరుబడ్డగిత్తలేవీ వెళ్ళకపోతే మేకపోతులు గెలుచుకుంటాయి బహుమతీలు, ఇక కుంభకందొరగారి గిత్తలికి వచ్చినగొప్ప యేమిట్రా?"

"గొప్పకేక్కడికి దొరా? ఇలా సద్దిచెప్పుకుని సమాధా

పడి వ్రూరుకోడానికి మనగిత్తలేం చేతగానివాఅనీ నావిచారం "

"పోనీ. బాబయ్యా, మనగిత్తల్ని పంపవద్దనడం నాదిపొర పాటే, మరితక్కినవారిమాట ? "

"నిజమే" అంటూ తలపంకించి "దేవలకుడంటే యెవ రికీనమ్మకంలేదు. లేకపోతే, బహుమతీలన్నీ కొట్టెయ్య డానికి కుంభకం బావగారి గిత్తల నోసటనే పొద్దుపొడి చిందా ? " అనడిగాడు నందుడు.

"విన్నావా ? " అనడిగాడు బలరాముడు.

"చిత్తందొరా, విన్నాను, అయితే, పందాలకు వెళ్ళ డానికి మన గిత్తలకింకా వయసు రాలేదంటారా యేలిన వారు ? "

"వయసురాలేదూ ? అదేమిట్రా ? నీచిత్తంవచ్చిన గిత్త లతో కలపటంచేసి చూసుకో " అన్నాడు నందుడు.

"పోనీ, మన కేంగిత్తలు తక్కువా ? తక్కినవాటిని తీసుకు వెళ్ళకపోయావూ, నీసరదా తీరును ? " అనడిగాడు కృష్ణుడు.

"తక్కిన గిత్తలంటే, అవిమాత్రం సాదాగిత్తలా ? కుంభ కందొరగారి గిత్తలు వాటినిమాత్రం పొడవగలవా ? కాని దంభోళీ శతకోటీ ప్రత్యేకంగా చెప్పుకోతగ్గవి కనక —"

"ప్రత్యేకంగా చెప్పుకోతగ్గవాటికి ప్రత్యేకంగానే వస్తుంది అవకాశం, తొందరపడితే యెలాగా ? "

"కృష్ణా, అదలావుండనియ్యి. రంగాపురంలో చిత్రకేతువు మామయ్యగారు దాళవాకుప్పునూర్పులు మొదలుపెట్టారంట. ఎల్లుండి నూరుకాళ్ళయెడ్లు పంపమని కోరుతూ వుత్తరం రాశారు. ఏమంటావు. ? "

"సన్నా అడుగుతారు బాబయ్యా ?"

"నిరుడు మనకి పంపారుగా ! పంపాలిమరి"

"ఏరా, వినపడిందా ?" అనడిగాడు కృష్ణుడు సింగన్నని

"పంపుదాం దొరా"

"నువ్వే వెంటవెళ్ళాలి"

"చిత్తం, నేనేవెడతాను దొరా"

"బలరామన్నా, ఏటావలిబీట్లోకి కూడా వెళ్ళాలన్నావు కాదూ ?" అనడిగాడు నందుడు.

"వెళ్ళాలి బాబయ్యా"

"కృష్ణా !"

"వెళ్ళిరండి బాబయ్యా"

నందుడు శతకోటినీ, దంభోళినీ దువ్వి, తట్టి, బయటికివచ్చి "సెలవా అయ్యవారూ ?" అనుడుగుతూనే అడుగువేశాడు.

"చిత్తం చిత్తం" అంటూ రెండడుగులు కూడావేసి జయంతు డాగిపోయాడు.

వెంటనే కృష్ణుడు గిత్తలదగ్గిరికివెళ్ళి దువ్వుతూ "సింగన్నా" అనిపిలిచాడు.

"ఏమిసెలవు దొరా ?"

"వేటిని పంపుతావు రంగాపురం ?"

"ఏలినవారు శోప్పడనంటే —" అంటూ చేతులునలుపుకుంటూ నసిశాడు సింగన్న.

"దంభోళినీ శతకోటినీకూడా తీసుకువెడతా నంటావు, అంతేనా ?"

"చిత్తం అంతేదొరా"

"ఇంకోటికూడా చెయ్యి"

"ఏమిసెలవు దొరా?

"అక్కడికి కుంభకం దొరగారి గిత్తలున్నా రావచ్చు"

"అవికూడా వచ్చాయంటే కలపటం అయిపోయిందన్న మాటే, తరవాత నన్నేంచేసినా చేసుకోండి తప్పదు దొరా"

"కలపటం కాకపోతేనూ నిన్నేమయినా చెయ్యడం, తెలిసిందా?"

"వహావా, నారాజా, ఆగిత్తలపనే కాదు, గోవిందుపని కూడా అయిపోయిందన్నమాటే, నీపాదాలకు మొక్కుతా దొరా" అంటూ సింగన్న కృష్ణుని పాదాలంటాడు.

"చెట్టంత అయ్యవారుండగా నాకా మొక్కుతావు సింగన్నా?" అనడిగాడు కృష్ణుడు, జయంతుణ్ణి చూపిస్తూ,

"బుద్ధిబుద్ధి, అయ్యవారి పాదాలూ మొక్కుతా దొరా" అంటూ చేతులుచాపుకుని, సింగన్న బయలుదేరాడు.

"ఆగు" అన్నాడు జయంతుడు.

సింగన్న ఆగాడు.

"గత్వా గత్వా — వెళ్ళినపని నీకు వ్యతిరేకం —"

"ఎంతమాట సెలవిచ్చారు అయ్యవారూ! అలా జరిగితే నన్ను నేనే కుప్పకి బలివేసుకుంటా, సరా?"

ఇలా అంటూ సింగన్న జయంతుని పాదాలంటి కళ్ళకద్దుకున్నాడు.

"ఇక నీయిష్టం. నిన్నడ్డుకునేవాడూ, నిన్ననే వాడూ,

లేదు. మరి వెళ్ళు. అయితే చూడూ, దంభోళికీ శతకోటికీ మాత్రమే గంటలూ మువ్వలూ కట్టు. వాటిని ముందువరసలో నడిపించు. వాటివెనక నువ్వు గుర్రంమీదవుండు ''

" చిత్తం, నారాజా '' అంటూ సింగన్న కృష్ణునికి వీర నమస్కారం చేశాడు.

౧౪

నీలకాళ్ళకి గజ్జెలు కట్టుకుంటూవుండగా " ఏంచేస్తున్నావు తల్లీ ? '' అనడుగుతూ వచ్చింది భద్ర.

" ఎందుకూ ? '' అనడిగింది నీల.

" నృత్యం చేస్తావా ? ''

" నేర్చుకోడం యివాళతోసరి. అయ్యవారికి బహుమతీ యిచ్చేస్తారు బాబయ్య. అందుకోసం ''

" అందుకోసమే వచ్చాను, చూసిపోదామనీ — మరిగంటే — ఆచల్లని మాటకూడా చెవిలోవేసుకుని వెడదామనికూడా —''

" ఏచల్లని మాటా ? ''

" ఏంనంగనాచివే మామ్మా ? . . . జయంతుడయ్య వారు వచ్చిన చల్లనిమాట ''

" ఏమిటీ ? జయంతుడయ్య వారు వచ్చారా ? ''

" ఇక్కడికీ రమ్మంటోంది మీఅమ్మ, చూస్తావుగా ? ''

" అయ్యో ''

" అయ్యో యేమిటి కొయ్యో ? వొళ్ళుమరిచిపో. చక్కంగా ఆడెయ్యి. సిగ్గుపడ్డావుసుమీ, అయ్యవారు వల్లమాలిన మనిషి, మీబావమనసు విరిచెయ్యగలడు ''

"బాబోయ్, ఎలాగమ్మా?"

"అమ్మోయ్, ఇలాగమ్మా" అంటూ నాలుగు హస్తాలు పట్టి నాలుగడుగులు వేసింది భద్ర.

ఆసమయంలో ధర్మద వచ్చింది.

"అమ్మోయ్! భద్ర ఎంతచక్కగా నృత్యం చేస్తోందో చూశావా?" అనడిగింది నీల.

"ఏంచెయ్యాకా? మొగుడు పాడతాడంట, భద్ర ఆడుతుందంట దినమ్మా రాత్రి. ఓమాటు వెళ్ళి చూసి రావాలి"

"చూసిచూసి నాఆశేచూడాలి అమ్మగారు"

"ఇవాళవెళ్లి చూద్దామమ్మా, ఏం?"

"అది సరే, కాని, సమయానికి జయంతుడయ్యవారు వచ్చారు, ఏంచేస్తావోమరి"

"వాళ్ళుమరిచి పోమన్నాను. సిగ్గుపడితే మెలాగా?" అనగింది భద్ర.

"విన్నావా? మరి గజ్జెలు కట్టుకోడం అయితే అలారా. నువ్వుకూడా రాభద్రా" అంటూ ధర్మద వెళ్ళిపోయింది.

"పదమ్మా పద" అంటూ నీలని నడిపించుకు వెళ్ళింది ఆవెనకనే భద్ర.

## ౧౫

ముందు గురువుకీ, తరవాత జయంతునికీ పాదాభివందనంచేసి, భద్ర చెయ్యిపట్టుకుని రంగస్థలానికి వెడుతూనే నృత్యం మొదలు పెట్టింది నీల.

తనకిచ్చే బహుమతీ మొత్తం తక్కువకాకూడదు. ఇందు కోసం గురువు ఆందోళన.

మూడేళ్ళుగా నేర్చుకుంటున్న విద్య సరిగా అంటిందో లేదో? ఇందుకోసం కుంభకుని ఆందోళన.

సరిగా పిలిచినట్టు వచ్చాడు అయ్యావారు, ఎందుకో? ఇందు కోసం ధర్మద ఆందోళన.

పిల్ల సిగ్గుపడిపోతుందేమో. అయ్యవారు పెదవి విరుస్తాడేమో? ఇందుకోసం భద్ర ఆందోళన.

అంతే; కాని, నీల అప్పటికే పరవశ మయిపోయింది.

జయంతుడున్నూ ముగ్ధుడయిపోయాడు.

శిష్యురాలి కల్పనచూసి గురువు ఆశ్చర్యచకితుడైనాడు.

కుంభకునికంటే ధర్మదా, ధర్మదకంటే భద్రా ఆచాతుర్యం చూసి మిక్కిలీ తృప్తిపడి "ఏమంటారు అయ్యవారు?" అనడుగుతున్నట్టు తరుచు జయంతునికేసి చూడసాగారు.

ఒక్కొక్క ముద్ర తోచినప్పుడొక్కొక్క ఉత్సాహం, ఒక్కొక్క అడుగుపడ్డప్పుడు ఒక్కొక్క సుఖం, ఒక్కొక్క భంగిమ సిద్ధించినప్పుడొక్కొక్క ఆనందం — నీల బ్రహ్మానంద సాక్షాత్కారం అనుభవించింది.

రెండుగడియలసేపు అనేకవిధాల తాళప్రస్తారంచేసి గురువు ముక్తాయించాడు.

నొసట అంకురించిన చెమటబిందువులు కొనగోట గీటు కుంటూ భద్ర ఆసరాతో నీలతల్లి చాటుకివెళ్ళి నుంచుంది.

జయంతుడు అనేకవిధాల గురువును శ్లాఘించాడు.

"మీరు మాఅమ్మాయికి అంతులేని విద్య దయచేశారు. మేము మీకివ్వకలిగింది మాత్రం బహుకొద్ది ద్రవ్యం. కాక పోతే కొండంత దేవునికి కొండంత పత్రి తేగలమా ? "పత్రం పుష్పం ఫలంతోయం" స్వీకరించండి" అంటూ, వెయ్యి న్నూటపదహారు మొహిరీలూ, చీరా, జామారూ, పసుపూ కుంకుమా, ఫలాలూ, తాంబూలమూ పళ్ళెంతో తెప్పించి నీలచేత గురువుకిప్పించాడు కుంభకుడు.

"తమవ్వార్షికం అలా జరుగుతూనేవుంటుంది బాబయ్యా" అంది ధర్మద.

దానిమీద, పరమానందభరితుడై "అమ్మా, మా పూర్వపుణ్యాంవల్ల తమ ఆశ్రయం దొరికింది మాకు. మమ్మల్ని తమ స్వజనంలోనే చేర్చుకున్నారు తమరు. ఇది మేము మరచి పోతామా ? ఇంతంత సంసారులున్నారీ వూళ్ళో, గురువులనూ పోషిస్తున్నారు; కాని తమరు మాయెడల చూపుతున్న ఆద రాభిమానాలు మరెవరు ఏగురువులకు చూపిస్తున్నారూ ? నాయనిం గారూ, నేను మొయ్యలేనంత సువర్ణందయచేశారు, బహుకొద్ది అంటున్నారు తమరు. అమాట ఈ సువర్ణాన్ని కోటిగుణితం చెయ్యలేదూ ? ఆదిలో యశోదమ్మగారికి నృత్యం నేర్పినప్పుడు మా నాయనగారిని తమతండ్రిగారెలా సత్క రించారో, నన్నిప్పుడు తమరలా సత్కరించారు, ఏంతక్కువా ? కాకపోయినా, వూరికేమాట అంటారుగాని తమరు ఎప్పుడు ఎవరికి ఏమి తక్కువచేశారూ ? తమలోగిలి నూరులోగిళ్ళయి వర్ధిల్లాలి. మావిద్యకు తమలోగిళ్ళలోనే వినియోగం కలగాలి" అంటూ ప్రశంసించాడు గురువు.

తరవాత, కుంభకుడు, గురువుకి సెలవిచ్చి ఆపళ్ళెం పరిచారిక చేత అతనియింటికి పంపించాడు.

"ఇంత నేర్పానుకోలేదు నే" నందిభద్ర, నీలను పొదువుకుని.

"విద్యలో పరిపూర్ణులు, నేర్పడంలో అందె వేసిన చెయ్యి" అన్నాడు కుంభకుడు గురువు నుద్దేశించి, జయంతునితో.

"మరి తమ అమ్మాయి ? ఇలాంటి శిష్యురాలు దొరకాలంటే ఎంత అదృష్టంవుండాలి ? "

వేణుగానంలో తన కొడుకంత వాడు లేడని మా యశోదమ్మ వదినకు వల్లమాలిన గర్వం" అంది ధర్మద, కళ్ళు తిప్పుకుంటూ.

"అమ్మా ! నృత్యంలో తనకూతురంత పిల్ల లేదని మా ధర్మద వదినకు పట్టరానంత గర్వం అంటారు యశోదమ్మగారు, తొందరపడకండి" అన్నాడు జయంతుడు, చేతులూపుకుంటూ.

దానిమీద "ఇక్కడ యీధర్మదమ్మగారూ, అక్కడ ఆయశోదమ్మగారూ ఇలాగర్వించుకుంటూ కూచుంటే చివరికేమవుతుంది అయ్యవారూ ?" అనడిగాడు కుంభకుడు.

"వియ్యం అయివూరుకుంటుంది దొరగారూ ! "వివాహాశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" అనికదా అన్నాడు శాస్త్రకారుడు ?"

జయంతుడిలా అనేటప్పటికి సిగ్గుపడిపోయి, నీల, మళ్ళీ తల్లి చాటున నక్కింది.

ధర్మదా కుంభకుడూ మొగమొగాలు చూసుకుంటూ చిరునవ్వు నవ్వుకున్నారు.

"భళీ, ఇకఅయ్యవారిదే భారం" అంది భద్ర, కళ్ళు చికిలించుకుంటూ.

"నాదా తరవాయి? ఎంతమాట అన్నారు? అయితే, వంట బ్రాహ్మలను కుదిర్చేసే వెడతాను నేను మారేపల్లె వాడ, సరా?" అన్నాడు జయంతుడు.

అందరూ నవ్వుకున్నారు.

"అప్పుడే వీళబూరెలకోసం వూటలూరుతున్నాడు" అంది భద్ర, జనాంతికంగా నీలతో.

అప్పుడు జయంతుడు "దొరగారు, నాకు సెలవిప్పించండి. మొన్న రంగడికోనలో యెడ్లపందాలు జరిగినప్పుడు, మా సాత్యకి, హయగ్రీవం దొరగారిదగ్గిర నూరావుల బేరంపుచ్చుకున్నాడు. సొమ్మిచ్చెయ్యడానికీ, ఆవులనెప్పుడు తోలిపెడతారో కనుక్కోడానికీ నేనీ వూరు వచ్చాను"

"పని అయిందా?"

"సొమ్మిచ్చేశాను. కుప్పనూర్పులకు తమ వియ్యంకుడుగారికి యెడ్లని తోలిపెట్టాలట, ఆపనిమీద వున్నారు హయగ్రీవం దొరగారు"

"తమరు మళ్ళీ దయచెయాలన్నమాట"

"అలాగే అనుకుంటాను"

"మేమూ యెడ్లని తోలిపెట్టాలి, చిత్రకేతువు బాబయ్యగారు నిన్ననే ఉత్తరంరాసి పంపారు"

"చిత్తం, నందుడు దొరగారున్నూ పంపిస్తున్నారు నూరుకాళ్ళ యెడ్లని. తమ అందరి క్షేమమూ తెలుసుకుని రమ్మ

న్నారు, యశోదమ్మగారు. నా అదృష్టం మంచిది; కనక, రంభా, ఊర్వశీ, మేనకా సిగ్గుపడవలసినంత గొప్ప నృత్యం నా కళ్ళబడింది, చాలాసంతోషం"

"చెల్లెమ్మని చూసి రెండుమాసాలా అయింది?" అనడిగాడు ధర్మదను కుంభకుడు.

"అవు" నని భర్తకుచెప్పి "మూడువంతులు నేనేవస్తాను, తప్పితే, రెండుమూడుదినాల్లో పాలకీ పంపుతాను వొకమాటు దయచెయ్యమని మనవిచెయ్యండి బాబయ్యా మా వదినతో" అంది ధర్మద.

"చిత్తం అమ్మా" అన్నాడు జయంతుడు.

"అమ్మా, అయ్యవారిపాదాలు మళ్ళీ మొక్కుకో, తీసుకు రాభద్రా" అంది ధర్మద.

భద్రతీసుకురాగా, నీల, జయంతుని పాదాలంటి మళ్ళీ కళ్ళకద్దుకుంది.

౧౬

"అమ్మాయి పెళ్ళి విషయం తొందరపడవలసినట్టే వుంది బుల్లి బాబయ్యా" అన్నాడు కుంభకుడు.

"పెళ్ళికొడుకుని చూశావా మరి?" అనడిగాడు శతరథుడు.

చద్దిభోజనాలయినాక, కచేరీ సావడిలో కూచునివుండగా వచ్చిందీ ప్రస్తావన.

సిరిదాముడూ దండపాణీ అక్కడేవున్నారు.

పరిచారిక తాంబూలపుపళ్ళెం తెచ్చి, వారిముందుంచి వెళ్ళిపోయింది.

శతరథుడొక్క లవంగం మాత్రమే నోటవేసుకున్నాడు. తక్కినవారు తాంబూలం వేసుకోసాగారు.

"పెళ్ళికొడుకుని చూడ్డం నేనా?" అని యెదురడిగాడు కుంభకుడు.

"మరెవరోయ్?"

"మీరే అలా అడుగుతారేం బుల్లిబాబయ్యా?"

దండపాణిమొగం వికసించింది. "మిమ్మల్ని కాదని బావగారేపని చేశారు మామయ్యా?" అనడిగాడతను.

"నిజమే. కుంభకం తండ్రి నెరగడు. కుంభకం నాకొడుకే అని నేను నమ్ముకునివున్నాను. నన్ను కొడుకుని చూచినట్టు చూశాడు. మా అన్నయ్య. ఆదినుంచీయిలా జరిగిపోతోంది యీ కుటుంబం. ఇక కుంభకం మరోలాగ యెలా అంటాడూ? అయితే, నాయనా, అమ్మాయి చూపు —"

"ఆమె కింకా యీ చూపు కలిగినట్టు తోచదు బుల్లిబాబయ్యా"

"పోనీ కోడలి మాట?"

"మొట్టమొదట మీతోటే నేనీవిషయం మాట్లాడ తలిచాను"

"అదీ భక్తి అంటే" అన్నాడు దండపాణి, తర్జనితో నిర్దేశిస్తూ.

సిరిదాముని గుండెలు దడదడలాడాయి.

కాని శతరథుని మొగం వికసించింది.

"నీసంగతి యేమిటి?" అనడిగాడు దండపాణిని అతను, వెంటనే.

"నాసంగతి యెవ రెరగని దేమివుంది? మీ అమ్మాయి కూడా మా అన్నయ్యకొడుకునే తనకొడుకని నమ్ముకునివుంది. నాఆస్తికూడా అతనిదే" అన్నాడు దండపాణి.

"విన్నావా కుంభకం? నీకు కలిసినట్టే మణిగ్రీవునకూ రెండు ఆస్తులు కలిశాయి. అతగాణ్ణి విడిచిపెట్టడం నావుద్దేశం కాదు' అనేశాడు శతరథుడు.

దీంతో, అచలంగా వుండిన చెరువు నీటిలో బండరాయి పడ్డట్టయింది.

కుంభకుడు తల పంకిస్తూ మొగం పక్కకి తిప్పుకున్నాడు.

సిరిదాము తులిక్కిపడ్డాడు.

అదిగ్రహించి "సిరిదాముణ్ణి యువరాజుని కూచోబెట్టినట్టు కూచోబెట్టి కమతం అంతా మణిగ్రీవుడే నిర్వహించుకు పోతున్నాడు" అన్నాడు దండపాణి, సిరిదాముని కేసి చూస్తూ.

దానిమీద "విన్నావా?" అన్నట్టు చూశాడు కుంభకుడు సిరిదాముణ్ణి, కరుగ్గా.

"రేపణ్ణుంచే దూరంగా వుండమంటాను మణిని, అబ్బో" అనుకున్నాడు సిరిదాముడు.

చూసిచూసి "నాలుగైదు మాసాలనుంచి నే నీవిషయమే ఆలోచిస్తూవున్నాను. "నీల నాకోడలే" అంది రెండుమూడు మాట్లు అమ్మాయి" అన్నాడు మళ్ళీ శతరథుడు.

"ఈఆలోచన తట్టగానే నాతో యెందుకు చెప్పారుకారూ బాబయ్యా?"

"ఇప్పుడు మాత్రం యేమి మించిపోయిందీ?"

" రేపల్లెవాడనుండి జయంతుడయ్యవారు దయచేశారు నిన్న సాయంత్రం. యశోదమ్మ మన అందరిక్షేమమూ తెలుసుకు రమ్మని పంపిందని మాత్రమే చెప్పారాయన; కానీ—"

" ధర్మమే. నీలవి యశోదమ్మ తన కొడుక్కి చేసుకోవాలనుకుంటే తప్పేంవుందీ? నా కన్నకూతురు మంజరీ, నా అన్న కూతురు యశోదమ్మా నాకొకటే. మంజరినీ యశోదమ్మనీ నువ్వూ ఒక్కవిధంగానే చూస్తున్నావు. అయితే, దండపాణి యిల్లరికం వచ్చి మన కుటుంబంలో కలిసిపోయి వున్నాడు. నువ్వు ఈభేదం గుర్తిస్తే చాలు "

" అదీమాట " అనుకున్నాడు దండపాణి.

కుంభకుడు తల పంకించి వూరుకున్నాడు.

సిరిదాము డిక అక్కడ వుండలేకపోయాడు.

" రంగాపురం యెడ్లని తోలిపెట్టడమేకాదూ బాబయ్యా" అనడిగాతను.

" పంపాలి, నిరుడు మనంతోలి తెచ్చుకున్నాంగా ? "

" అయితే, చల్లబడ్డాక, బీట్లోనుంచే తోలుకు పొమ్మంటాను గోవిందుని "

" నూరుకాళ్ళ యెడ్లని పంపాలిసుమా "

" అలాగే బాబయ్యా" అంటూ వెళ్ళిపోయాడు సిరిదాముడు.

" కళ్ళాల పని పూర్తికాలేదు. నేనూపాలంపోతా " నంటూ దండపాణి కూడా వెళ్ళిపోయాడు.

ఒక్కక్షణం వూరుకుని " కుంభకం! " అని పిలిచాడు శతరథుడు.

"ఏం బాబయ్యా?"

"అన్నీ నువ్వే యెరుగుదువు. అయినా, వున్న నాలుగు సంగతులూ చెబితే అదో తృప్తి"

"చెప్పండి బాబయ్యా"

"మీాపిన్ని పోయింది. నువ్వేనాకుదిక్కు. మణిగ్రీవునికి కన్న తల్లీతండ్రీలేరు. అమ్మాయికి సంతానమూలేదు. ఈకారణంవల్ల మణిగ్రీవుడు నామనమడయి పోయాడు. ఇవాళదండపాణి విడిపోతే లోకమూ హర్షించదు. నీకూ శ్రేయస్సుకాదు. ఇప్పటికి పాతికసంవత్సరాలుగా మన కమతంమీాదవున్నాడు దండపాణి. మణిగ్రీవుడయినా అన్నివిధాలా సిసింద్రీ కాని జజ్జమ్మ కాడు. పైసంబంధంచేసి మనం నీలని విడిచి వుండలేము. ఇవన్నీ కోడలికి నచ్చచెప్పు"

"కోడలి కిందులో తెలియనిదేమిటి బాబయ్యా?"

"అయితే, యీావైశాఖం వెళ్ళకుండానే ముడిపెట్టేద్దాం, నేనూ పెద్దవాణ్ణియిపోయాను"

తల పంకించి పంకించి, పక్కకి చూసిచూసి "సరే, చెబుతాగా?" అంటూ యింట్లోకి వెళ్ళిపోయాడు కుంభకుడు.

౧౭

ఆవెళ్ళడం వెళ్ళడం, గబగబా గిత్తలున్న సావడిలోకి వెళ్ళాడు సిరిదాముడు.

"ఏమిఁదొరా?" అంటూ గోవిందు ప్రత్యుత్థానంచేశాడు.

"రంగాపురం నూరుకాళ్ళమెడ్లని తోలిపెట్టాలి"

"అవును, పెద్దదొరగారు కూడా చెప్పారు, తోలిపెడదాం దొరా"

"మరి వెంట వెళ్ళడం?"

"నామనవి —" అని చేతులు నలుపుకుంటూ నసికాడు గోవిందు.

"ఏమంటావ్?"

"సెలవయితే, నేనేవెడతాను దొరా"

"అంతే?"

"గిత్తల్ని కూడా తీసుకుని"

"అక్కడికి నందుడు మామయ్యగారి యెడ్లూ వస్తాయంట మరి?"

"అందుకనే దొరా నేనువెళ్ళడం"

"వారిగిత్తలు కూడా వస్తే చూద్దామనా?"

కాదన్నట్టు తల అడ్డంగా వూపాడు గోవిందు, గంభీరంగా చూస్తూ.

"నీవుద్దేశం యేమిటో స్పష్టంగా చెప్పెయ్యి"

"మనగిత్తల్ని కూడా తీసుకువెళ్ళి —"

"—తీసుకువెళ్ళి?"

"కలపటం —" అని మళ్ళీనసికాడు గోవిందు.

"చేసెయ్యి" అన్నాడు సిరిదాముడు, తల యెగరవేసుకుంటూ.

"ఎన్నాళ్ళీముసుగులో గుద్దులాట? వారికీ మనకీ విడిపోతే విడిపోనీ. అందుకోసం కూడా కలపటం చేసెయ్యవలసిందే" అనికూడా అన్నాడతను.

"నీకాళ్ళు మొక్కుతా దొరా" అంటూ వృద్ధ్వశ్వాసతో ముందు సిరిదాముని పాదాలంటాడు గోవిందు.

"పెద్దదొరగారూ, తాతయ్యదొరగారూ వాట్లని మహా పొగిడేస్తున్నారు. అక్కడ, వారి పెద్ద పాలికాపుసింగన్న కూడా సొరకాయలు నరికేస్తున్నాడంట. నారక్తం వుడుకెత్తిపోయింది దొరా! నా నరాలు పొంగిపోతున్నాయి దొరా! నాకునిద్రాహారాలు సయించడంలేదు దొరా! మనగిత్తలు దంభోళినీ, శతకోటినీ కుయిక్కు మనిపించడం చూస్తేగాని నేనిక బతకలేను దొరా!" అంటూ తరవాత పరవళ్ళుతొక్కాడు.

"నీయిష్టం అన్నానుగా?" అన్నాడు సిరిదాముడు.

పెద్దబరువు దింపేసుకున్నట్టు నిట్టూర్పువిడుస్తూ "సరే దొరా" అన్నాడు గోవిందు, స్తంభానికి చేరబడి.

"నువ్వేమీ యెరగనట్టుండాలి. వాటిని చూశాయంటే కళ్ళుమూసుకుని అగ్గిపిడుగుల్లాగ మనగిత్తలే మీదపడిపోతాయి గానీ — ఒకవేళ అలా జరక్కపోతే చాటుగా నువ్వు ఉసికొల్పాలి. తరవాత, వాటిని కుమ్మేసేదాకా నువ్వు తెల్లపోయి — శొయ్యయిపోయినట్టుండాలి. తరవాతే, మెల్లిగావిడిపించాలి, తెలిసిందా?"

"తెలిసిందిదొరా. నువ్వామాత్రం భరవసా యిస్తే — ఇక చూసుకో దొరా"

"మళ్ళీ యింటికి రావడం యెందుకూ? బీట్లోనుంచే తోలుకుపో"

"ఒక్క మనవిదొరా"

"మొన్నటి బహుమతీలు గిత్తలక్కడతా నంటావు. అంతేనా?"

"అంతే అంతే దొరా! మనగిత్తల్ని చూసి రంగాపురా నికి రంగాపురం విరగబడి పోవాలిదొరా! అదీ నా సరదా"

"నువ్వు గుర్రంమీద వెళ్ళు"

"నీకాళ్ళకి మొక్కుతా దొరా" అంటూ మళ్ళీ సిరిదా ముని పాదాలంటాడు గోవిందు.

"గిత్తలు వరాసగా ముందుండాలి. వాటి తరవాత నువ్వు. నీవెనక తక్కిన మెద్దూ మనుషులూనూ"

"నారంగా, సింగన్న వుసూరుమంటూ నడిచి వస్తాడు. చచ్చాడన్నమాటే వాడు"

"రంగడికోనలో నేను జయం తీసుకురావడం కాదు గొప్ప. రంగాపురం నుంచి నువ్వు తీసుకురావాలి"

"అలా అన్నావు బాగుంది, లేకపోతే నన్ను మారుపేరు పెట్టి పిలుచుకో దొరా" అంటూ గుండెలు కొట్టుకున్నాడు గోవిందు.

అప్పుడు "మారుపేరుపెట్టి పిలుచుకోమంటున్నా డేమిటి గోవిందు, బావా?" అనడుగుతూ వచ్చాడు శంకరం.

"చెబుతారా" అంటూ సిరిదాము డివతలికి రాగా "వోరి శకునపక్షిగా!" అని మెల్లిగా అంటూ అగ్గయిపో యాడు గోవిందు, శంకరాన్ని చూసి.

౧౮

చల్లబడ్డాక "మునపట్లా పనికిరాదు, ఇక పొలాలు చూసు కోవా" లనుకుంటూ బయలుదేరిన సిరిదాముణ్ణి యిల్లట్లోకి

తీసుకువెళ్ళి "కమతంపని చూడు నాయనా" అని యెంత పోరినా విన్నావా? చూడు మరెలా విషమించిందో?" అనడిగాడు కుంభకుడు, కనుబొమ్మలు చిట్లించుకుంటూ.

"పొరబాటే బాబయ్యా" అంటూ సిరిదాముడు మొగం వంచుకున్నాడు.

ఇంతలో "యేమియేమి" టంటూ ధర్మదా "యేమిటమ్మా?" అంటూ ఆమె వెనకనే నీలా వచ్చారు.

"అమ్మాయి పెళ్ళిమాట తెచ్చాను బుల్లిబాబయ్యదగ్గిర" అన్నాడు కుంభకుడు.

"మణిగ్రీవునకు ఇమ్మన్నారు మామయ్య, కదూ?" అనడిగింది ధర్మద, నిష్ఠురంగా.

నీలచకిత అయిచూసింది.

"వల్లకాదు బాబయ్యా" అన్నాడు సిరిదాముడు, తీవ్రంగా చూస్తూ.

"ముందు తన చెరిసగంవాటా విడగొట్టమంటారు బుల్లిబాబయ్య. తరవాత, దండపాణి యిల్లరికంవాటా అక్కడ పెట్టమంటాడు. ఇదంతా అయాక కమతం నడుపుతున్నందుకు "మరి నామాట యేమి చెప్పా" రంటాడు మణిగ్రీవుడు" అన్నాడు కుంభకుడు, యెత్తుపడిపోయి.

సిరిదామునకు పచ్చివెలక్కాయ గొంతుక పడ్డట్టయింది.

నీల గుడ్లనీళ్ళు కుక్కుకుని మొగం వంచుకుంది.

అదిచూసి "ఏమితల్లీ? ఎందుకుతల్లీ?" అంటూ ఆమెని పొదువుకుని "చూశారా?" అనడిగింది, కుంభకుణ్ణి, ధర్మద.

దీనిమీాద "మణిగ్రీవునిమాట నేనింకా నిశ్చయంచెయ్యలేదు. కదమ్మా ?" అంటూ వెళ్ళి కుంభకుడు నీల గడ్డంపుణికాడు.

"అబ్బే, అతనికిస్తామా ? బెంగటిల్లకమ్మా" అంటూ ధర్మద, నీల కళ్ళు తుడిచింది.

"నాకు ఆస్తి తక్కువయిపోయినా సరే, చెల్లాయికి మీారు మణిగ్రీవుణ్ణి చూడ్డానికి వల్లకాదు బాబయ్యా" అన్నాడు సిరిదాముడు, పురపురచూస్తూ.

"మరి నీవుద్దేశం యేమిటోయ్ ?"

"శంకరం విషయం ఆలోచించండి"

"సడే" అంటూ యీసడించుకుంది ధర్మద.

అదింకా పూర్తికాకుండానే "నువ్వా చెప్పుదెబ్బలమారితో సావాసం మానకపోతే, నీకూనాకూ నేటితో చెల్లన్నయ్యా" అంది నీల, తోకతొక్కిన తాచులాగ వూగిపోతూ.

దీనికిసాయం "ఎంత అజ్ఞాని వయిపోయావు నాయనా ?" అంటూ విసుక్కున్నాడు కుంభకుడు.

సిరిదామునకు పిడుగుపడ్డట్టయింది.

ఒక్కక్షణం మాట్లాడలేక పోయాడతను.

ఇక అక్కడ వుండడానికిన్నీ అతనికి మొగంచెల్లలేదు.

దాంతో సాహసించి "బాబయ్యా, ఇంతవరకూ నేను చేసినవన్నీ తప్పులేకావచ్చు. వాటి కింకొక్క తప్పుకలిస్తే కొత్తగా వచ్చేచిక్కేమీాలేదు. కనక, వినండి. చెల్లాయిని మీారింకెవరికిచ్చినా సంతోషమే; కాని కృష్ణుడుబావకి మాత్రం యివ్వవద్దు. ఇస్తేమాత్రం బాగా జరగదు" అంటూ చరచరన వెళ్ళిపోయాడతను.

నీల దెబ్బతిన్న పాములా చూసింది.

"మతిపోయింది" అంది ధర్మద.

"ఇంత పిచ్చినాగన్న అయిపోయాడేం నాయన?" అంటూ బిక్కమొగం వేశాడు కుంభకుడు.

"ఒక్కపిల్ల. శుభమా అని పెళ్ళి తలపెట్టుకుంటే యింత చిచ్చొకొంపకి?" అంది పరితాపంగా ధర్మద.

"అప్పుడే యేమయినట్టూ?"

"ఇంకా యేం మూడిందీ?"

"యువరాజులుంగారికి కివ్వరాదుటయ్యా?" అనడిగి వెళ్ళాడు రెండుగడియల కిందట రాజుగారి పురోహితు డయ్యవారు"

దీనిమీద ధర్మద యేదో అనబోతూవుండగానే "దాసీ పిల్లలూ, భోగం పాపలూ చాల రటనా?" అంటూ కస్సు మంది నీల.

ఉలిక్కిపడి చూసింది ధర్మద కుంభకుని కేసి.

కుంభకుడు నిట్టూర్పువిడుస్తూ కళ్ళుమూసుకుని నుంచున్న వాడు నుంచున్నట్టుగానే గోడకి చేరబడిపోయాడు.

"చూడండీ, ఇప్పటికది కట్టిపెట్టి మీరుపొలం వెళ్ళండీ" అంటూ కుంభకుని భుజంమీదతట్టి "రావే తల్లీ" అంటూ నీల చెయ్యిపట్టుకుంది ధర్మద.

కుంభకుడు కాళ్ళీడ్చుకుంటూ బయలుదేరాడు.

ధర్మదా నీలా యింటోకి వెళ్ళిపోయారు.

౧౯

నాలుగైదు గడియలపొద్దు మాత్రమే వుంది.

విశాలమైన తామరకొలని నానుకునివుండిన రంగాపురం.

ఆకాశం అంటుతున్న మేడల ధవళకాంతులతో ధగధగలాడు తోంది.

పొలాలలోవున్న పెద్దపెద్ద దాళువాకుప్పలు ఊరిరక్షణకు కట్టుకున్న దుర్గశ్రేణుల్లా వున్నాయి.

బీళ్ళలో మేతకి వెళ్ళివుండిన పశువులమంద లొక్కటొక్కటే వూళ్ళోకి వస్తున్నాయి.

ఇలాంటి సమయంలో, పడమటి పుంతలోనుంచి కుంభకుని యెడ్లూ, దక్షిణపుపుంతలో నుంచి నందుని యెడ్లూ పదిగజాల హెచ్చుతక్కువలలో వొక్కమాటేవచ్చి కొలని దక్షిణపు గట్టు చేరుకున్నాయి.

వెంటనే యిటు గోవిందు రక్తం కుతకుత వుడికింది.

అటు సింగన్న నరాలు భుగభుగపొంగాయి.

అప్పటికప్పుడే యిక్కడ సిరిదాముని గిత్తలూ, అక్కడ కృష్ణుని గిత్తలూ కోరచూపులు ప్రారంభించాయి.

అదిచూసి, వచ్చిన మందలను వచ్చినట్టుగానే అక్కడా అక్కడా వుండిన కుప్పలదగ్గిరికి తీసుకువెళ్ళడానికి, అదివరకే అక్కడ చేరివుండిన చిత్రకేతువు పాలికాపులు "ఛో, ఛో" అంటూ అదలిస్తూనే వున్నారు. గాని యిటు గోవిందూ, అటు సింగన్నా, గుర్రాలమీాదేవుండి అపవారించి "సర్రుచ్చి, సర్రుచ్చి" అంటూ రెచ్చగొట్టడం వల్ల ఆ గిత్తలూ యీా గిత్తలూ కూడా ఓరచూపులు చూసుకుంటూ కాళ్లు దువ్వి, రంకెలు వేసి, బుస్సలు కొట్టి, చివరికి గభీమని డీకున్నాయి.

చూస్తుండగా వడిసెల్లో రాళ్ళలాగ బెడ్డముక్క లెగర పొగాయి.

సుడిగాలి తిరుగుతున్నట్టు దుమ్ము రేగింది.

సమ్మెటపెట్లలాగ కొమ్ముల వారిపిళ్లు ఖణేల్ ఖణేల్ మంటున్నాయి.

కళ్లు నిప్పు లెగురుతున్నట్టు మెరుస్తున్నాయి.

గిత్తలు మెరుపుతీగల్లా దుముకుతున్నాయి.

"తప్పుకోండి, తప్పుకోండి" అంటూ చిత్ర కేతువు పెద్ద పాలికావు తనవాళ్ళని అదలించాడు.

దానిమీద "లింగూలింగూ మంటూ రెండు గిత్తల్ని పెట్టుకుని కులుకుతున్నావు. అదిలించుకోవద్దూ?" అంటూ గోవిందూ, "ఊరబందుల్లాగ యేడుగిత్తలున్నాయికదా అని మురిసిపోతున్నావు. నువ్వా నేనా అదలించుకోవలసింది?" అంటూ సింగన్నా వొకళ్ళనొకళ్ళు గదుముకున్నారు.

"మరి చూసుకో ఏమవుతుందో?" అన్నాడు మళ్ళీ గోవిందు.

"తొందరపడకోయ్ మొనగాడా" అని సింగన్నా మళ్ళీ అన్నాడు.

"ఊరుకోండి, వూరుకోండి" అని మందలించారు చిత్ర కేతువు పాలికాపులు.

మళ్ళీ అందరూ గిత్తలకేసి చూశారు.

సిరిదాముని గిత్తలు కొండల్లా మీదపడుతున్నాయి.

కృష్ణుని గిత్తలు పిడుగుల్లాగ మొగిసిపడుతున్నాయి.

ఇలాగ వొక్క అరగడియ గడిచింది.

ఏడు గిత్తల్ని రెండుగిత్తలు పూర్వవైరం ఉన్న ట్టెదిరించ

డమూ, ఎంతసేపటికీ వెనుదియ్యకపోడమూ చూసి చిత్రకే తువు పాలికాపులు ఆశ్చర్యచకితులయిపోయారు.

"ఇంకా యెంతసేపు? సర్రుచ్చి, సర్రుచ్చి" అంటూనే వున్నాడు గోవిందు మెల్లిగా.

సింగన్న కూడా "ఇంతసేపా? కుమ్ము, పడగొట్టు, ఎగ జిమ్ము" అంటున్నాడు మెల్లిగా.

దీనివల్ల గిత్తలకి రోషం యెక్కు వయింది.

పోరు ఘోర మయింది.

చూడగా, ఇంతలో వొకగిత్త బావుమంటూ డేకింది.

మరో గిత్త వెల్లకితలా పడిపోయింది.

గోవిందూ సింగన్నా కంగారుపడుతూ చూశాటప్పటికి మరోగిత్త పిల్లిమంతరాలు వేసింది.

అంతే.

ఉత్తరక్షణంలో సిరిదాముని గిత్తలు తక్కినవి తోకర్పూడించాయి. కృష్ణుని గిత్తలు వాటిని కుమ్ముతూ, ఎగజిమ్ముతూ, దుమ్ములో పొర్లిస్తూ వెంటపడ్డాయి.

అదిచూసి గోవిందు వాటివెనకనే గుర్రం వుడాయించాడు.

సింగన్న వెన్నువిరుచుకుంటూ మీసంమీద చెయ్యివేసు కున్నాడు.

అతని గుర్రం ఆకాశం చిల్లులు పడేటట్లు సకిలించింది.

## ౨౦

"పెద్దపులి వూళ్ళోజొరబడింది. యిళ్ళల్లోదూరి తలుపులు వేసుకోండి" అంటూ గావుకేకలుపెడుతూ వొకయువకుడు తన యింట్లోదూరి ఫెడీమని తలుపులు వేసుకున్నాడు.

ఈ మాట పక్కవీధిలోకి వెళ్ళేటప్పటికి పెద్దపులి అల్లా చిరతపులి అయిపోయింది.

మరో వీధిలోకి వెళ్ళేటప్పటికి అదీకాక, ఎలుగ్గొడ్డు అయింది.

ఇంకో వీధిలోకి వెళ్ళేటప్పటికి పిచ్చికుక్క అయింది.

దానిపక్కవీధిలోకి వెళ్ళేటప్పటికి గున్నయేనుగయింది.

చివరివీధికి వెళ్ళేటప్పటికి "గున్నాకాదు, ఏనుగూకాదు, గొడుగేదె, ఒకటి కాదంట రెండు" అన్నాడొక పురుషుడు పుంజాలు తెంపుకుని పారిపోతూ.

క్షణంలో మిథిలఅంతా తుపానుపట్టిన సముద్రంలాగ అల్లకల్లోలం అయిపోయింది.

విన్నవారందరూ తలుపులు బిగించుకున్నారు.

ఉన్నవారందరూ మిద్దెలూ మేడలూ యెక్కి చూశారు.

అప్పటికి "అవేవీకావు, గిత్త" లనీ "రెండూకాదు, మూడు" అనీ తేలింది.

ఒక వీధిలో చెరువునుంచి నీళ్ళు తెచ్చుకుంటున్న ఒకగొల్లభామని ఒకగిత్త పడగొట్టి వెళ్ళిపోయింది.

మరోవీధిలో ధాన్యపుబండి వస్తోంది. ఒకగిత్త యెడ్లని కుమ్మేసి వెళ్ళిపోయింది.

ఇంకోవీధిలో అప్పుడే పాఠశాల విడిచిపెట్టారు. పిల్లలు బిలబిల్లాడుతూ బయలుదేరారు. ఉత్తరక్షణంలో వాళ్ళకగిత్త అయిదారుగురు పిల్లలను పడేసీ, నలుగురైదుగురు పిల్లలను తొక్కేసీ వెళ్ళిపోయింది.

చివరివీధిలో ఒకగొల్లనాయడు నాలుగు చూడావులను

విడిగా తోలుకువెడుతున్నాడు. ఒకగిత్తవచ్చి, వాటిలో వొక ఆవును కుమ్మేసీ, గొల్లనాయణ్ణి యెత్తిపారేసీ వెళ్ళిపోయింది.

యువరాజు గుఱ్ఱంమీద వాహ్యాళికి వెళ్ళివుండి, మళ్ళీ, వూరిబయటికి వచ్చాటప్పటికి గిత్తలసంగతి తెలిసింది. ఊళ్ళోకి వెళ్ళడమా మానడమా అనుకుంటూ అత నక్కడే ఆగిపోయాడు; కాని యాదాలాభంగా అటూయిటూ చూశాటప్పటి పిడుగులా వస్తున్న గిత్త కనపడింది. వెంటనే, అతను, వూర్ధ్వశ్వాసతో గుఱ్ఱం దిగి గభీమని చెట్టెక్కేశాడు; కాని అప్పటి కప్పుడే గిత్త గుఱ్ఱాన్ని కుమ్మేసి వెళ్ళిపోయింది.

శంకరమూ దత్తయ్యా కొలనిగట్టున మెల్లిగా తిరుగుతున్నారు.

"దుర్గ నిన్ను చెప్పుచ్చుకొట్టినసంగతి నాతో చెప్పావా? చెబితే, పదిరూపాయలు పారేసో, కడుపూ కాలూ పట్టుకు బతిమాలో "శంకరందొరగారంటే దేవుడుకాదూ? రామ రామా, ఆయన్ని నేను చూడందే?" అని దానిచేత నే సాక్ష్యం చెప్పించివుండనూ?" అనడిగాడు దత్తయ్య.

"అది నన్ను కొట్టడమా? పైగా చెప్పుదెబ్బలా? రామ రామా! నువ్వెలా నమ్మావయ్యా, నాసొమ్ముకూడా తింటున్నావూ? నన్ను దూరాన్నే చూసిందది, రుసరుసలాడుతూ వెళ్ళిపోయిందంతే. కాకపోయినా; పెరుగమ్ముకునేదానితోనా నాకు సరసాలూ? ఛీఛీ! అది కృష్ణుడుగాడికి చెల్లిందిగానీ —" అన్నాడు శంకరం, యీసడించుకుంటూ.

"అయితే, నిన్నుచూసి రుసరుసలాడిందన్నావే దుర్గ, దానికారణం?"

"అదేమి టయ్యోయ్? నన్ను పోషిస్తున్న వాడిలా అడుగు తున్నా వే ప్రశ్నలు! ఓహో, ముదురుతోంది కథ"

దత్తయ్య నవ్వుకుని వూరుకున్నాడు.

దూరాన రణగొణధ్వని వినపడింది.

"చచ్చారు, చచ్చారు. తప్పుకోండి తప్పుకోండి" అంటూ దగ్గరగానే కేకలు వినపడ్డాయి.

ఇద్దరికీ కంగారు పుట్టింది.

తప్పుకుందా మని వొక మొగు రెగిరాడు శంకరం; కాని మురుక్కాలవలో పడ్డాడు.

దత్తయ్య కాళ్ళు తొక్కుకుని కూలబడ్డాడు.

ఇంతలో గిత్తవచ్చి కొమ్ములతో యెత్తి కాలనిలోకి విసిరేసి వెళ్ళిపోయింది.

౨౧

పొన్నచెట్టు మొదట అరుగుమీద కూచునివుంది నీల.

పొన్నకొమ్మ నానుకుని పక్కగా నుంచుని వున్నాడు మణిగ్రీవుడు.

"తాతయ్యగారి ఆ స్త్రీకోసం ఆశించికాదు నేనిక్కడ వుంట. మాదండపాణిబాబయ్య ఆ స్త్రీకోసమూకాదు నేనిక్కడవుంట. కమతంమీద పనిచేస్తున్నందుకు కుంభకం మామయ్య ఎంతో కొంత ముట్టచెబుతారనికూడా కాదు నేనిక్కడ వుంట. నీకోసం వున్నాను నేను. నీకెప్పటికి దయవస్తుందో అని తపస్సు చేస్తూ నీపాదా లాశ్రయించుకుని వున్నాను నేను" అన్నాడు మణిగ్రీవుడు.

నీల విని వూరుకుంది.

"శ్రీదేవి నాకోసం తపస్సుచేస్తూ వుండడం నువ్వెరుగు దువు. కామాక్షి తల్లివచ్చి నూదండపాణిబాబయ్యని ప్రార్థించడం కూడా నీకు తెలుసు. వారందినాలనుంచి మదనలేఖ నా కేసి సాకూతంగా చూస్తున్నట్టు సిరిదాముడు బావే ముందు గుర్తించి నాతో చెప్పాడు. స్థితీ, మర్యాదా, చక్కదనమూ, ప్రేమా — వీటిలో వా ళ్ళెవరికయినా తీసిపోతారా? కాని, నాచూపు నీమీదే వుంది. నాహృదయం నీమీదే లగ్నం అయి వుంది. నువ్వు కటాక్షిస్తేనే నాకు వివాహం" అన్నాడు మణిగ్రీవుడు మళ్ళీ.

అప్పుడు కూడా నీల మాట్లాడలేదు; కాని "చచ్చిపోతావురా, చచ్చిపోతావురా, తప్పుకోరా, తప్పుకోరా" అంటూ వొక స్త్రీ ఆర్తనాదం వినవచ్చింది.

ఉలిక్కిపడి నీల లేచి వెళ్ళిపోయింది.

ఉసూరుమంటూ మణిగ్రీవుడూ వెళ్ళిపోయాడు.

* * * *

శతరథుడూ దండపాణీ కచేరీసావడిలో కూచునివున్నారు.

"మీచేతుల్లో పెరిగారు కుంభకంబావ, మీరుపట్టుపడితే కాదనగలరా?" అనడిగాడు దండపాణి.

"నాధైర్యం అదే"

"మన వాటాలు మనం తీసేసుకుంటా మని కచ్చితంగా చెప్పేస్తే సిరిదాముని నరాలు బిగుసుకుపోవూ?"

"కుర్రనాగమ్మ. అయినా, నామాట తీసెయ్యడనే నా నమ్మకం"

"మీ అమ్మాయి ఇల్లు సద్దుతూవుంటే రాణీలాగ మసులు కుంటోంది ధర్మదలక్కయ్యా. మీఅమ్మాయి, తనసంసారమే చక్కబెట్టుకుని వూరుకుంటుం దనుకోండి, ఇక ఆవిడ కాలూ చెయ్యీ ఆడుతుందా ?"

"ఆమాటకివస్తే, కుంభకంకంటే ధర్మదే నామాట యెక్కువ మన్నిస్తుంది"

"ఇంకేం ? పోనీ, అబ్బాయికంటే చక్కనివాడు ఈ వూళ్ళో — రెండు వేలగడపవుంది గొల్లకులం యిక్కడ, వొక్కడయినా వున్నాడా ?"

"అవన్నీ సరేనయ్యా, పిల్లమాటచెప్పు. దానికి కృష్ణుని మీద చూపుపడ్డదా ?"

"పడుతుం దనుకోండి. పోనీ పడిం దనుకోండి. ఊరంతా చుట్టబెడుతున్నాడు కృష్ణుడు, ఎవరెరగరూ ? రాధమ్మ సరే సరీ, యెవరికి తెలియదూ ? వెయ్యిమంది సవతుల్లో వొకర్తి అవుతుంది నీల, దీనికేం చెబుతారూ ?"

"నీకు రహస్యం తెలవలేదు"

"ఏమిటదీ ?"

"ఒక ఆడది కోరేవాణ్ణే మరోఆడదీ కోరుతుంది. ఎవర్తీ కోరదూ, వాడు ఆడదానికి సేవచెయ్యవలసిందే"

"అయితే మాత్రం ? మీ మాట కాదనవలసిందే ?"

మణిగ్రీవుడు కంగారుగావచ్చి "కొంప మునిగింది" అంటూ గోలపెట్టాడు.

"ఏం, ఏం ?"

"గిత్తలు పిచ్చెత్తి వూళ్ళోపడ్డాయి. తొక్కిచంపేస్తున్నాయి జనాన్ని"

"మనవే?"

ఇలా అంటూ శతరథుడూ దండపాణీ లేచి వీధిలోకి బయలుదేరారు.

"ఇప్పటికి నాలుగుగిత్తలే కనపడుతున్నాయంట. తక్కిన మూడూ— " అని మణిగ్రీవుడు చెప్పబోగా మాటకడ్డంవచ్చి "వెళ్ళి మామయ్యతో చెప్పు, ఇంటోనేవున్నా" డన్నాడు శతరథుడు.

మణిగ్రీవు డింటోకి వెళ్ళాడు.

*　　*　　*　　*

ధర్మదా, కుంభకుడూ వుయ్యాలమీద కూచునివున్నారు.

ధర్మద మెల్లిగా వూపుతోంది.

"ఎన్ని మాట్లడిగినా జయంతు డయ్యవారు వచ్చినప్పుడు మీరే మన్నారో జ్ఞాపకం చేసుకో మంటుం దంతే"

"మనమేమీ అనలేదే"

"నేనూ ఆమాటే అన్నాను. "పోనీ ఏమనుకున్నారో చెప్పండీ" అంది.

"అనుకున్నదల్లా సాగుతుందా?"

"సాగినా సాగకపోయినా మనం ప్రయత్నించింది మాత్రం యేమి వుందండీ నిజానికీ?"

"నువ్వొగసన తోస్తున్నావన్న మాట"

"పోనీ, మీరు దిగసనతియ్యండి. చివరికి నన్నా నెపపెట్టడం?"

"జరిగింది మరిచిపో. ఇప్పుడు కష్టసుఖా లాలోచించు"

"ఎవరి కష్టసుఖాలూ?"

"కొంపవి. రాజ్యం లేదు గాని రాచరికం అనుభవిస్తున్నాం మనం. రాజుగారే మనపిల్లను కోరారు, చూసుకో. కాని, మణిగ్రీవుణ్ణి కాదంటే పాలికాపులక్కంటే కనాకష్టం అయిపోమూ?"

"మణిగ్రీవుడు పెద్దపాలికాపు కాదు టండీ?"

"ఓసి నీయిల్లు బంగారంగానూ, పోనీ – అబ్బాయి –"

"సడే! అక్కడికి మణిగ్రీవుని కివ్వడానికి అబ్బాయి వొప్పుకున్నట్టు, కదూ?"

"మణిగ్రీవుడి మాటకాదే"

"అసలుమాట తప్పిస్తే అంతా తెల్లమొగం వేసే వాళ్ళే. "నువ్వు హయగ్రీవంమామయ్యగారి చంద్రరేఖని మరిచిపోతావా?" అంటూ నిలవతీసింది. అబ్బాయిని, అమ్మాయి"

"అదోటా?"

"సడే, దానిక్ నిద్రాహారాలు లేవంట. ఒకటే కలవరింపంట అబ్బాయికోసం"

అప్పుడు "అమ్మోయ్, అమ్మోయ్" అంటూ వొకవైపునుంచి నీలా, "మామయ్యా, మామయ్యా" అంటూ మరోవైపునుంచి మణిగ్రీవుడూ కంగారుగా వచ్చారు.

ఉలిక్కిపడి "ఏమిూ ఏమిూ!" అంటూ ధర్మదా కుంభకుడూ లేచినుంచున్నారు.

"మనగిత్తలు పూరిమిూదపడి జనాన్ని తొక్కి చంపేస్తున్నాయంట బాబయ్యా" అంది నీల.

"చాలామంది గోలపెట్టేస్తున్నారు మామయ్యా" అన్నాడు మణిగ్రీవుడు.

"గుర్రాన్ని నురగలు కక్కించుకుంటూ వస్తున్నాడు బాబయ్యా, గోవిందు"

ముందు కుంభకుడూ, అతనివెంట మణిగ్రీవుడూ కంగారుగా వీధిలోకి వెళ్ళిపోయారు.

"నువ్వెక్కడ చూశావమ్మా గోవిందునీ?" అనడిగింది ధర్మద.

"మేడమీదనుంచి చూశాను. కొలనిదగ్గిర కనపడ్డాడు"

"అదేం వులకమే మామ్మా?" అంటూ ధర్మదా "ఏవిషపు తీగయినా తిన్నాడేమో?" అంటూ నీలాకూడా వీధిలోకి బయలుదేరారు.

* * * *

ఇంటివెనక తోటలో, దొడ్డిగుమ్మానికి చేరువగావున్న సంపంగె పొదచాటున సిరిదాముడూ వొకయువతీ నుంచునివున్నారు.

"ఎంతసేపూ సమయంకావద్దా అంటావు నువ్వు. మీ అమ్మతోనో, మీ నాయనతోనో చెప్పి పెళ్ళియేర్పాటు చేసుకోమంటున్నాం గాని, యిదేమయినా కానిపనా? కాక. నీకు మంచిసమయం అయేటప్పటికి దానికి ప్రాణాలుపోయే సమయం అవుతుందేమో?" అంది యువతి.

"అంత వుపద్రవాని కేం వచ్చిందీ?" అనడిగాడు సిరి దాముడు.

"అన్నగారే వుపద్రవం. చంద్రరేఖ నిన్ను పెళ్ళాడ్డం మహేంద్రునకిష్టంలేదు"

" తనచెల్లెలిగొడవ అతనికెందుకూ ? "

" ఆసూత్రం నీమీదికి తిప్పి చూసుకో "

" నాసంగతి వేరు. మాకృష్ణుడు బావ పిల్లంగోరూది ఆడాళ్ళని వల్లో వేసుకుంటాడు. అది నేను సహించను. ఒక పరాక్రమం చూపాలి, ఒక ప్రజ్ఞ కనపరచాలి –"

" మరి అతగాడు చేసిన పనులు ? "

" గారడీ ! శుద్ధ ఇంద్రజాలం "

ఇంతలో " పెంచాడు పెంచాడు కారుదున్నపోతుల్లా పెంచి చివరికి నిన్ను తనపొట్టని పెట్టుకున్నాడు సిరిదాముడు. ఈ గిత్తల్ని నాశనం చేసే మొనగాడు భూమ్మీద లేడూ ?" అంటూ ఒక ఆర్తనాదం వినిపించింది.

" ఆ ? " అంటూ తెల్లబోయాడు సిరిదాముడు.

" ముందు ఆయింద్రజాలం యేమిటో చూడు " అంటూ యువతి దొడ్డిదారిని వెళ్ళిపోయింది.

"మాగిత్తలు వూళ్ళోలేవే?" అంటూ సిరిదాముడున్ను వీధిలోకి బయలుదేరాడు.

౨౨

కంగారుపడుతూ ముందు శతరథుడూ దండపాణీ వీధిలోకి వచ్చారు.

తరవాత కుంభకుడూ మణిగ్రీవుడూ వచ్చారు.

వారివెనకనే ధర్మదా, నీలా, యిద్దరు ముగ్గురు పరిచారికలూ వచ్చారు.

అప్పటికి వాణికిపోతూ ఎక్కణ్ణుంచో రామభద్రుడు వచ్చాడు.

"గిత్తలు చెలరేగి, వూరిమీదపడి, జనాన్ని తొక్కి చంపేస్తున్నాయి దొరగారూ" అన్నాడు రామభద్రుడు.

"అదేమిట్రా?" అన్నాడు కుంభకుడు.

"ఎడ్లతోబాటుగా యేడుగిత్తల్ని రంగాపురం తోలుకు వెళ్ళాడండి గోవిందు. అడంగుకి వెళ్ళాడో లేదో, వెడితే యేమిజరిగిందో, యీ వుపద్రవంఅంతా యేమిటో — "

"గిత్తలన్నీ చెలరేగాయా?"

"ఇప్పటికి నాలుగే కనపడ్డాయండి"

"చాలామందిని పొడిచాయా?"

"పొడవడంతో కుదిరిందా దొరగారూ, కొందరు బతుకుతారో బతకరో సందేహమేనండి"

"అయ్యో" అన్నారందరూ వొక్కమాటుగా.

"యువరాజులుంగారి గుర్రాన్ని కుమ్మేసిందండి వొక గిత్త. ముందు అదేదో చూసుకోవాలి దొరగారూ"

రామభద్రుడిలా చెబుతూవుండగా "యేమిటి బాబయ్యా? ఏమిటిరామభద్రా?" అంటూ ఆదుర్దాపడుతూ వచ్చాడు సిరిదాముడు.

సిరిదాముడిలా వచ్చాటప్పటికి, గుర్రంమీద యెగిరివచ్చి, దిగి, "దండాలు బాబయ్యా" అంటూ వాణికిపోయాడు గోవిందు.

"కొంపములిగింది దొరగారూ" అన్నాడు కూడా.

"ఏమిట్రా సంగతీ ?"

"రంగాపురం చెరువుగట్టున నందుడు దొరగారి గిత్తలకీ మన గిత్తలకీ కలపటం అయిపోయింది దొరగారూ"

"అయ్యో" అంది ధర్మాంబ, అపవారించి నీలతో.

"చూశావా, చూశావా ?" అంది నీల, అపవారించి తల్లితో.

"ఎందుకయిందీ ?" అనడిగాడు శతరథుడు.

"ఎందుకయిందీ యేమిటి 'అసలు, గిత్తల నెందుకు తీసుకు వెళ్ళావూ ?' అనడగండి" అన్నాడు కుంభకుడు కోపంగా.

"ఏమిరా ?" అన్నాడు శతరథుడు.

గోవిందు సిరిదాముని కేసి చూశాడు.

"నేను తీసుకువెళ్ళమన్నాను తాతయ్యా" అన్నాడు, సిరిదాముడు.

"గిత్తల్ని చేరి స్తేగానీ నూరుకాళ్ళూ పూర్తికాలేదా ?"

సిరిదాముడు మళ్ళీ మొగం వంచుకున్నాడు.

"సరే, కలపటం యెందుకయిందీ?" అనడిగాడు కుంభకుడు.

"వీటినిచూసి అవీ, వాటినిచూసి యివీ —"

"నువ్వసికొలిపావా లేదా ?"

"మరండి, మరండి —" అని నసుకుతూ మళ్ళీ సిరిదాముని కేసి చూశాడు గోవిందు.

సిరిదాముడు మొగం పక్కకి తిప్పుకున్నాడు.

"ఏరా, నిజం చెబుతావా చెప్పవా ?" అంటూ మీదికి వెళ్ళాడు కుంభకుడు.

"చిత్తం చిత్తం బాబయ్యా, నే నుసిగొలిపిన మాట నిజమేనండి"

"అన్నయ్యే వుసిగొలపమన్నాడు, తెలవడంలేదూ?" అంది నీల, అపవారించి మళ్ళీ తల్లితో.

"ఎందు కుసిగొలిపావ్రా?"

"అంతంతలేసి బహుమతీలు కొట్టుకువచ్చినా మనగిత్తల కంటే అవే గొప్పవని అందరూ అనడం వినలేక - అదేదో తేల్చేద్దామని —" అని వ్రూరుకున్నాడు గోవిందు.

· "నీకే తోచిందా?"

"ఎవరికి తోస్తేయేం, యికచాలు, జరిగిపోయింది అదీ. వ్రాళ్ళోసంగతి చూడిండి ముందు" అంది కుంభకున కడ్డంవచ్చి, ధర్మద.

"ఊరిమీాద నాలుగే వున్నాయంట, తక్కినవి మూడూ ఏమయినాయిరా?" అనడిగాడు శతరథుడు.

"పొలాలమీాద పడ్డాయి దొరగారు"

"కుప్ప లెగజిమ్ముతాయి. ఇళ్ళకి వచ్చే పశువుల్ని కుమ్మేస్తాయి, ఏం నాయనా, సరదా తీరిందా?" అని కుంభకు డడగ్గా సిరిదాముడు మళ్ళీ మొగం వంచుకున్నాడు.

"అక్కడ కలపటం కావడంయేమిటి, యిక్కడ యీాఅల్ల రేమిటి, నాకేమీా విడిపోవడంలేదు మామయ్యా" అన్నాడు దండపాణి.

"ఏం జరిగిందిరా?" అనడిగాడు గోవిందుని శతరథుడు.

"వారిగిత్తలమీాద కొండలు విరిగిపడ్డట్టు పడ్డాయండి మన

గిత్తలు. మన గిత్తలమీద పిడుగు లూడిపడ్డట్టు పడ్డాయండి వారిగిత్తలు ”

“ పడి ? ”

“ చివరికి ఓడిపోయాయండి మన గిత్తలు ” అన్నాడు గోవిందు, మొగంవంచుకుని, హీనస్వరంతో.

“ ఓడిపోయాక పౌరుషం వచ్చింది. దాంతో వూరిమీద పడ్డాయి. కసితీరాలిగదా మరి ? ” అన్నాడు దండపాణితో, శతరథుడు.

“ వారిగిత్త లెన్నిరా ? ” అనడిగాడు మణిగ్రీవుడు.

“ దంభోళీ, శతకోటీ - రెండేనండి ”

“ కూడా యెవరు వచ్చారో అడగవమ్మా ” అంది సీల, తల్లితో ఆపవారించి.

“ వాటితో యజమాను లెవరయినా వచ్చారా ? ” అనడిగింది ధర్మద.

“ లేదమ్మగారూ, పాలికాపులే వచ్చారండి ”

“ సరే, వూరిమీదికివెళ్ళి ముందుగిత్తల్ని దొడ్డిచేర్చు. మణిగ్రీవా, నువ్వుకూడా వెళ్ళు. దండపాణి బావగారు, మీరు కూడా — ” అన్నాడు కుంభకుడు.

“ రామభద్రా, నువ్వు నాతోరా, మనం మరోవీధికి వెడదాం ” అంటూ బయలుదేరాడు సిరిరాముడు.

“ ఆగండి ” అంటూ అప్పు డొక రాజభటుడు సిరిదాముని కడ్డంవచ్చాడు.

“ తమగిత్తలు యువరాలుంగారి గుర్రాన్నికుమ్మేశాయంట.

ర్వేష్పపాటులో తప్పించుకున్నారుగాని లేకపోతే యువరాజు లుంగారిమీదే పడిపోయి వుండునంట. వూళ్ళో జనాన్ని కూడా వానా అల్లరీ చేస్తున్నాయంట గిత్తలు. తమరిన్నీ అబ్బాయిగారినీ నుంచున్న పాళంగా తీసుకురమ్మని మహారాజులుంగారి సెలవ యింది దొరగారూ" అన్నాడు రాజభటుడు, కుంభకునితో.

"అయ్యో, అయ్యో, నే నేంచేతునే?" అంటూ తహతహ లాడిపోయింది ధర్మద.

"ఉండవమ్మా, తొందరపడతావేం?" అంది నీల.

"విన్నారా బాబయ్యా?" అనడిగాడు కుంభకుడు.

"తప్పుతుందా మరి? వెళ్ళిరా, తక్కిన సంగతులు నేను చూస్తాను" అన్నాడు శతరథుడు.

"పదవోయ్" అని భటునితోనూ "రావోయ్ నాయనా" అని సిరిదామునితోనూ అని కుంభకుడు బయలుదేరాడు.

"యువరాజు నిన్ను పెళ్ళాడ తలిచాడు. ఒప్పుకోకపోతే యెంత పనయినా చేస్తాడు మహారాజిప్పుడు" అంది మెల్లిగా నీలతో, ధర్మద.

"నాయన్నీ, అన్నయ్యనీ ఏమయినా చెయ్యనీ, పోడి చేస్తాను, అబ్బో?" అంటూ వుగ్రురాలయి పోయింది నీల.

## ౨౩

నగంజారిలో కలుసుకుని "ఏమిదొరగారూ, యిలా వచ్చింది?" అనడిగాడు రాజపురోహితుడు కుంభకుణ్ణి.

"గ్రహచారం. మరేంచెప్పను నయ్యవారూ?"

"ఊరంతా గజగజలాడిపోతోంది. యువరాజులుంగారి
కింకా అదటుపోలేదు"

"వారు మహావీరులనీ గిరిధీరులనీ విన్నాము"

"కనకనే, అతిలాఘువంగా చెక్కెక్కి తప్పించుకోగలిగారు"

"అది తప్పించుకోడం కాదు, మాగి త్తని కటాక్షించడం.
వారికే ఆగ్రహంవచ్చి వుంటే అది యేమయిపోయి వుండునో!"

"వారలా తొందరపడేవారు కారే ?"

"తెలుస్తూనే వుందిగా ?"

"గి త్త లిలావస్తే చిక్కే. కనక త్వరగా అడుగు వేయించండి"

"ఇంతకంటే గొప్పచిక్కుంటుందా స్వామీ ?"

"ఉండావచ్చు, ఉండకాపోవచ్చు. ఇంతకీ, నేను మనవి చేసు
కున్న విషయం ఆలోచించండి. తమకేమీ భయం కలగదు"

"తమ రిన్నిమాట్లు సెలవిప్పించా టప్పు డూరుకుంటానా
స్వామీ ?"

"సంతోషం. తమరు దయచెయ్యండి, నేను తరవాత కలుసు
కుంటాను"

ఇలా అని పురోహితుడు వెళ్ళిపోయాడు.

"ఇంకా ఆదుస్సంకల్పం విడిచిపెట్టవే ?" అంటూ గుర్రుగా
చూశాడు సిరిదాముడు.

"ఎవరి దుస్సంకల్పం యెవరు విడిచిపెట్టారు నాయనా ?"
అని యెదురడిగాడు కుంభకుడు.

తరవాత యిద్దరూ మౌనంగా కోటకి వెళ్ళిపోయారు.

* * *

మంత్రి సామంతాదులతో బలిసి నిండుకొలువు తీరి వున్నాడు మహారాజు ధర్మ్మడు.

"దండాలు మహాప్రభూ" అంటూ యెదటికి వెళ్ళి చేతులు కట్టుకు నుంచున్నారు కుంభకుడూ, సిరిచాముడూను.

"ఏమి దొరగారూ, ఇలా వచ్చింది?" అనడిగాడు మహారాజు.

"ఏమి చెప్పుకోడానికయినా మాకు తెల్సినంతలో యేమీ లేదు మహాప్రభూ" అని బదులు చెప్పాడు కుంభకుడు.

"మూలం యేమయినా చెప్పగలరా?"

"కుప్పనూర్పులకు వెళ్ళిన మాగిత్తలకూ మా నందుడు బావగారి గిత్తలకూ కలపటం అయిపోయిందంట మహాప్రభూ రంగాపురంలో. వాటిపోటు భరించలేక మ్యాగిత్తలు పారిపోయి వచ్చాయి; కాని యీ వుద్ధృతం యేమిటో చాలూ మూలం కనపడదు"

"కలపటాని క్కారణం?" అనడిగాడు మంత్రి.

"పాలికాపుల అహంకారం అని తోస్తుంది"

"చూసిరమ్మంటే కాల్చి వస్తారన్నమాట పాలికాపులు" అన్నాడు మహారాజు, మంత్రితో.

"చిత్తం చిత్తం, మూలమేమో మానుషం - జరిగిపోయిందేమో దైవికం — కాని చివరికి అంతా రాజకీయంలో పడ్డది మహాప్రభూ" అన్నాడు మంత్రి.

"నష్టం యేమాత్రం?"

"ఇప్పటి కిరవై మంది స్త్రీ పురుషులకూ, నాలు గావులకూ,

పదహారు ఎడ్లకూ కముకుదెబ్బలు తగిలాయి. వెంకటాచలం దొరగారి శంకరం తప్పించుకోపోయి మురుగు కాలవలో కూలబడ్డాడు. అతని నర్మసచివుడు దేవదత్తయ్యని గిత్తె యెత్తి చెరువులోకి విసిరేసింది. యువరాజులుంగారి గుర్రం కుంటుతోంది. మహాప్రభూ" అంటూ కాగితం చూస్తూ చెప్పాడు మంత్రి.

అప్పుడొక భటుడు వచ్చి "మరో నలుగు పురుషులు దెబ్బలు తిన్నారు మహాప్రభూ! రెండావులు పడిపోయాయి, నాలు గెడ్లు దెబ్బలు తిన్నాయి. శంకరం దొరగారి బండెడ్లలో వొకదానికి కొమ్ములు విరిగిపోయాయి. పొలాల్లో నాలుగు కుప్పలు చిందరవందర అయిపోయాయి మహాప్రభూ" అంటూ విన్నవించుకున్నాడు.

మంత్రి ఆవివరాలు రాసుకున్నాడు.

కుంభకుడూ సిరిదాముడూ మొగమొగాలు చూసుకున్నారు.

"విన్నారుకదూ?" అనడిగాడు రాజు కుంభకుణ్ణి.

"చిత్త చిత్తం, విన్నాను మహాప్రభూ"

"ఏమి చెబుతారు?"

"మంత్రిగారు సెలవిప్పించినట్టు జరిగిందంతా దైవికం. చివరి: తమచేతిలో పడ్డది. తమ రెలా సెలవిప్పిస్తే అలానడుచుకుంటాను. మహాప్రభూ"

"ఊళ్ళోకి వెళ్ళి, యెక్కడెక్కడ, యెవరెవరికి, ఎలాంటి కష్టమూ నష్టమూ కలిగాయో మేము విచారణ చేస్తాము. వారినందరినీ మీరే సర్దుపాటు చేసుకుంటే సరే, లేకపోతే, అప్పుడు మేము కలగజేసుకుంటాము"

"చిత్తం, మేమే సద్దుబాటు చేసుకుంటాము మహాప్రభూ!"

"జరిగినదానికి సద్దుబాటు. మరి ముందుమాట? వెంటనే గిత్తలను జాగ్రత్తపెట్టుకోండి. ఆసంగతి తెలుసుకోడానికి మేమెదురుచూస్తూ వుంటాము. అశ్రద్ధజరిగినా, ఇంకా నష్టం కలిగినా కఠినచర్య జరుపుతాము. గుర్తుంచుకోండి"

"చిత్తం మహాప్రభూ. మరి యువరాజులుంగారి గుర్రం విషయం —"

"గుర్రం కుంటుతోంది నిజమే. అయితే, అబ్బాయి మీాకేదో వర్తమానించాడట?"

"నిజమే మహాప్రభూ! ఇప్పుడిప్పుడు, మేము ఏలినవారి దర్శనానికి వస్తూవుంటే కూడా 'ఏంచెప్పా' రనడిగారు అయ్యవారు."

"భయపెట్టారా?"

"ఆవిషయం సవ్యంగా పరిష్కరిస్తే మాకేమీాభయం కలగదని —"

"ఓహో, చాలాదూరం వెళ్ళింది వ్యవహారం. కనక, అదంతా సావకాశంగా ఆలోచిస్తాము! ఇప్పటికి మీారు వెళ్ళండి"

"చిత్తం, సెలవు మహాప్రభూ!"

"సిరిదామా,"

"చిత్తం మహాప్రభూ"

"నువ్వు అనవసరవిషయాల్లో కలగజేసుకుంటున్నట్టు తెలుస్తోంది. గిత్తలవిషయంచూస్తే దోషంఅంతానీది. ఇకనయినా

బుద్ధిగా మసులుకోకపోతే శిక్షించవలసి వస్తుంది, జాగ్రత్త"

"చిత్తం చిత్తం, ఇకబుద్ధిగా వుంటాను మహాప్రభూ"

"వెళ్ళు"

"చిత్తం మహాప్రభూ"

కుంభకుడూ, సిరిదాముడూ వంగి నమస్కారాలు చేసి వెళ్ళిపోయారు.

౨౪

కోటదాటాక "నాయనా" అని పిలిచాడు, కుంభకుడు.

"ఆ"

"ఏకపుత్రుడవైన నీవల్ల నాకు కలిగిన మొదటి ఆనందం యిది"

సిరిదాముడు సిగ్గుపడి మొగం వంచుకున్నాడు.

"నీవల్ల ఎంతో ఆశించాను. అనుభవం యిలా ప్రారంభం అయింది. గిత్తలవల్ల నువ్వూ చాలా ఆశించావు. నీకూ మంచి అనుభవమే ప్రారంభం అయింది"

సిరిదాము డలాగే మొగంవంచుకుని వుండిపోయాడు.

"తరతరాలుగా రాజసభలో మెప్పుడూ మందలింపులు ఎరగని వంశం మనది, దానికి నువ్వు అంకురార్పణచేశావు. చాలా సంతోషం నాయనా"

అప్పుడు పక్క సందులోనుంచి రొజుకుంటూ మణిగ్రీవుడు వచ్చాడు.

"ఊళ్ళో చెలరేగుతున్న నాలుగుగిత్తలూ దొడ్డిచేరుకున్నాయి మామయ్యా"

"సంతోషం. ఏమిజరిగింది నాయనా!"

"చూసిచూసి హయగ్రీవం బాబయ్యగారు మనగిత్తలతో తమగిత్తలను ఢీకొలిపారు. కలపటం అయిపోయింది. భూమి గజగజలాడిపోయింది. నిప్పులు రాలాయి. చివరికి మన గిత్తలు పారిపోయి దొడ్డి చేరుకున్నాయి"

"సెబాస్, ఇదేవుపాయం. పొలంమీదకి కూడాఆగిత్తలను తీసుకువెడదాం. హయగ్రీవంబావగా రింటిదగ్గిరే వున్నారా?"

"ఈగిత్తలిలా దొడ్డిచేరగానే వారలా పొలాలకు బయలుదేరారు మామయ్యా! సత్యకీర్తి తాతయ్యగారి గిత్తలను కూడా అడిగి తోలుకువెళ్ళారు బాబయ్య"

"ఓహ్హో! ఏమి వుపకారం. ఈజన్మలో వారిరుణం తీర్చుకోలేము"

"నేనూ పొలంవెడతాను బాబయ్యా" అంటూనే సిరిదాము డెగిరి పోయాడు.

"గిత్తలు దొడ్డికి చేరుకోగానే "నారాజులారా, మీకీగతి యెందుకుపట్టింది?" అని యేడుస్తూ దొడ్లో ప్రవేశించాడు గోవిందు; కాని వెళ్ళీవెళ్ళడంతోనే నాలుగు గిత్తలూ వొక్కమాటే బుస్సుమంటూ మీదపడి, కుమ్మి, యెత్తిపారేశాయి గోడమీదనుంచి యివతలికి"

"అయ్యో, బతికివున్నాడా?"

"దెబ్బలు తగిలాయంతే, కట్టుకట్టాం, గోడమీదకూచుని వాటికోసమే యేడుస్తున్నాడు మళ్ళీ"

"ఇటు పెంచిన మమకారమూ, అటుచేసిన పాపమూ

పండాయి, సరేకాని, నలుగురు మనుషులు గోడలెక్కి సిద్ధంగా వుండండి. తలుపులు దగ్గిరసా చేర్చి వుంచండి. దేవుడు మేలు చేస్తే తక్కిన గిత్తలుకూడా అలాగేదొడ్డిని పడితాయి. వెంటనే తలుపులు వేసెయ్యండి ”

“ అలాగే మామయ్యా ” అంటూ మణిగ్రీవుడు వెళ్ళి పోయాడు.

అప్పుడు, కుంభకుడు నాలుగువైపులకూ తిరుగుతూ “ అయ్యలారా, అమ్మలారా, వూళ్ళో అల్లరిచేసిన నాలుగు గిత్తలూ దొడ్డినిపడ్డాయి. తక్కిన మూడుగిత్తలూ క్షణంలోనో క్షణంలోనో దొడ్డినిపడతాయి, సందేహంలేదు. అంతవరకూ వోపికపట్టండి. మాపాపంపండి యిది యిల్లా సంభవించింది. ఈ రాత్రి మట్టుకు తలుపులు తీసియివతలికిరాకండి. నన్నుమన్నించండి ” అని మాటిమాటికీ గొంతెత్తి అంటూ, యింటికి వెళ్ళాడు.

౨౫

“ సింగన్నతో నువ్వేమన్నా చెప్పావా తమ్ముడూ ? ” అనడుగుతూ వచ్చాడు బలరాముడు.

ఉలిక్కిపడిచూశాడు జయంతుడు.

“ అవును, చెప్పా నన్నయ్యా ” అన్నాడు కృష్ణుడు, గ్రీవాభంగాభిరామంగా చూస్తూ.

కృష్ణుడూ జయంతుడూ బీట్లోకూచుని వున్నారు.

“ నువ్వు చేప్పేవుంటావన్నారు బాబయ్య ” అంటూ వచ్చి యెదట కూచున్నాడు బలరాముడు.

"ఠోప్పడ్డారా ?"

"చుట్టరికం చెడనివ్వకండన్నారంతే"

"దీనివల్ల రెండులాభాలు కలుగుతాయి బలరామన్నా, చెడ్డంయేమిటి ?" అనడిగాడు జయంతుడు.

"ఒకటి సిరిదాముడు బావకి శృంగభంగం కావడం"

"అంతే అంతే"

"అదీ ముఖ్యం అయింది. దాంతో అన్నిలాభాలే"

"రంగాపురంలో ఏమిజరిగిందో ?"

"ఏమిజరిగిందో ? అలా సందేహిస్తావేం కృష్ణా, అదిగో, మనగిత్తలు వచ్చేస్తున్నాయి చూసుకోవయ్యా" అంటూ లేచి నుంచున్నాడు జయంతుడు.

"ఏవీ, ఏవీ ?" అంటూ బలరాముడూ కృష్ణుడూ లేచి చూశాటప్పటికి దంభోళీ శతకోటీ యెగిరి వచ్చి వారిదగ్గిర వాలాయి.

బలరాముడూ కృష్ణుడూ ఆమాంతంగా వెళ్ళి వాటిని కౌగిలించుకుని "పొడిచేవచ్చాయి, ఏం అన్నయ్యా" అంటే "సందేహం యేమిటోయ్ ? ఉప్పొంగిపోతున్నాయి చూడవోయ్" అంటూ కృష్ణుడూ, బలరాముడూ వాటిని దువ్వసాగారు.

ఇంతలో సింగన్న యెగిరివచ్చి, గుర్రం దిగి "మన గిత్తలు కుమ్మేశాయిదొరా. సిరిదాముడు దొరగారి గిత్తలు డేకిపోయాయిదొరా, గోవిందు సగంచచ్చి పుడాయించేశాడు దొరా" అంటూ పరవళ్ళు తొక్కాడు.

"ఈజయుం అంతా నీదీ" అన్నాడు కృష్ణుడు.

దానిమీాద "నువ్వంతమాట అన్నావు, నాజన్మకిది చాలు దొరా, నీకాళ్ళు మొక్కుతాదొరా" అంటూవచ్చి సింగన్న తనకాళ్ళు పట్టుబోగా "అగు ఆగు" అని వారించి "ముందు అన్నయ్యకి మొక్కుకో. అంతకంటే ముందు – అయ్యవారు న్నారు కనపడ్డంలేదూ" అన్నాడు కృష్ణుడు.

"బుద్ధి బుద్ధి, వొళ్ళు తెలవడంలేదు దొరా," అంటూవెళ్ళి "దీవించు అయ్యవారూ" అని జయింతుని కాళ్లుపట్టుకున్నాడు సింగన్న.

"దీవిస్తానుగానీ – ముందులే" అన్నాడు జయంతుడు.

సింగన్న లేచాడు.

"బలరామన్నకీ, కృష్ణునికీ కూడా మొక్కరా దీవిస్తాను"

"నాదొరా, నాదొరా" అంటూ వారి కిద్దరికీ మొక్కి, సింగన్న, మళ్ళీ జయంతుని యెదటికి వెళ్ళి దోసిలివొగ్గి నుంచు న్నాడు.

జయంతుడప్పుడు సింగన్న నెత్తిమీాద వరదహస్తంవుంచి "కృష్ణా, బలరామన్నా, దీవించేస్తున్నానుమరి. బాధ్యత మాత్రం మీాదీ" అన్నాడు.

"దీవించు" అన్నాడు కృష్ణుడు.

"వివాహ సిద్ధిరస్తు"

"పిల్లని చూసుకోమనవయ్యా" అన్నాడు బలరాముడు.

"ఏం, సింగన్నా, వినపడిందా?"

"వినపడిందయ్యా, సంవత్సరంకిందటేచూసుకున్నానయ్యా. పిల్ల మహాతొందర పడితోందయ్యా"

"వోరిపిడుగా, ఎవరాపిల్ల ?"

"మా పెత్తాత మనమరాలయ్యా"

"మాణిభద్రుని కూతురా ? జయశ్రీ ?"

"అవునయ్యా"

"అయితే, యిక ఆగడానికి వల్లకాదు, మూడేళ్ళయింది రజస్వల అయి" అన్నాడు కృష్ణుడు.

"మూడేళ్ళకిందట రజస్వల లయిన అందరుపిల్లల సంగతీ అంతేనామరి ?"

"అంతే"

"పద్దినాలు గడువుపెట్టనా ?"

"చాలు"

"ఏం, వినపడిందా సింగన్నా ?"

"వినపడిందయ్యా" అంటూ సింగన్న మళ్ళీ జయంతుని పాదాలు తాకి గిత్తలదగ్గిరికి వెళ్ళాడు.

"సింగన్నా, ఇకనువ్వు వూళ్ళోకి వెళ్ళిపో. గుర్రంమీాద వెళ్ళిపో" అన్నాడు కృష్ణుడు.

"మరి గిత్తలో దొరా"

"మేము తోలుకువస్తాములే"

"అయితే, దొరా నొక్కమనవి"

"ఏమిటది ?"

"ముందు సిరిదాముడు దొరగారి గిత్తలు వోడిపోయిన సంగతి వూరంతా యేకేస్తాను. తరవాత, పూలదండలు సిద్ధం చేసి, హారతికూడా —"

సిద్ధంచేయించు. అయితే, ముందు హారతి యివ్వడం యెవరూ ?"

"తోచడంలేదు దొరా"

"జయశ్రీ యివ్వాలి. దారిలోనేగా యిల్లూ ?" అన్నాడు జయంతుడు.

"నారాజా, చెప్పేస్తాదొరా"

ఇలా అంటూ గుర్రంయెక్కి సింగన్న యెగిరిపోయాడు.

౨౮

జామురాత్రి అయాలప్పటికి పొలాల్లో అల్లరిచేసిన గిత్తలు కూడా దొడ్డిచేరుకున్నాయి.

కుంభకుడు ఈ సంగతి వెంటనే వూళ్ళో చాటింపు చేయించాడు.

అప్పటివరకూ యిళ్ళల్లో ముడుచుక్కూచున్న వారందరూ అప్పుడు బైటికి వచ్చి వూపిరి తీసుకున్నారు.

రెండుజాములు దాటేదాకా వూరంతా కిటకిట లాడి పోయింది.

అతిపరిచయం కలవారందరూ కుంభకుని యింటికే వచ్చి, జరిగిపోయినదానికి చాలా వింతపడి, ఎంతో నొచ్చుకుని "ఈశ్వరేచ్ఛకి మీరేం చేస్తారూ ?" అంటూ చివరికి భరవసా యిచ్చారు.

కుంభకుడు, హయగ్రీవుణ్ణి, అతని యింటికి తాను వెళ్ళి, తన యింటి కతణ్ణి తీసుకువచ్చి, చేసిన వుపకారానికి చాలా

మెచ్చుకునీ, చాలా పొగిడీ, చాలా కృతజ్ఞత కనబరిచాడు.

"హిమాచలం కుంటుతోం" దంటూ సిరిదాముడు బిక్క మొగం వెయ్యగా "మన గిత్త లెందరికాళ్ళు విరగగొట్టాయో, ఎందరిడొక్కలు చీల్చాయో, తప్పుతప్పు, ప్రారుకో" మని మందలించాడు కుంభకుడు.

"హిమాచలం కుంటడంచూసి అన్నీ దానిచుట్టూ చేరాయి. మొగంమీద మొగంపెట్టాయి. కళ్ళల్లో నీళ్లుపెట్టుకున్నాయి" అన్నాడు దండపాణి వచ్చి.

అది విని అందరూ ఆశ్చర్యచకితు లైనారు.

"లోకసామాన్యం గిత్తలుకావివి. ఏదో విశేషంవుంది బావగారూ" అన్నాడు హయగ్రీవుడు.

"హిమాచలం కుంటడం చూశాక, తక్కినగిత్తలు మరీ కోపంగా వున్నట్టు కనబడుతున్నాయి" అన్నాడు మణి గ్రీవుడు వచ్చి.

దానిమీద "చూడగా, వాటికి పూర్వజన్మస్మృతి వున్నట్టూ, అవి పూర్వజన్మలో హింసచేసే ప్రాణు లయివుండి నట్టూ కనపడుతుంది. మొత్తాని కవి అన్నిగిత్తలపాటివీ మాత్రం కావు" అన్నాడు శతరథుడు.

అప్పుడు "అవి యిక, మళ్ళీ సాధువులుగా నడుచుకుం టాయా?" అన్నాడు కుంభకుడు.

వెంటనే కొందరు "నడుచుకో" వన్నారు. కొందరు "నడుచుకోకేం?" అన్నారు. కొందరు "సందేహామే" అన్నారు. కొందరు "రెండుమూడు దినాలు పోతేగాని

యేమీ చెప్పలే" మన్నారు. కొందరు "ఏమయినా, వాటిని ఆబోతులుగా విడిచిపెట్టడం మంచిదికా" దన్నారు. కొందరు "అలాంటి గిత్తలే ఆబోతులుగా వుండకపోతే మంచి వృషభ జాతి యెక్కణ్ణుంచి వస్తుం" దన్నారు. కొందరు "మనకి కొంపలుముంచే వృషభజాతి అక్కర్లే" దని వారిని ముదల కించారు.

ఒక్కక్షణం "పనికిరాదు" "మహాబాగా పనికివస్తుంది" "నిదానించాలి" "దీర్ఘాలోచన మంచిది కాదు" "అంతా తలోమాటా అనకండి" "ఎవరిమాటలకీ తలవ్వాపకండి" "అడుసు తొక్కనేల, కాలు కడకనేల?" "కుశ్శంకలు పెట్టుకూర్చుంటే నెగ్గలేం" "కొరివితో తల గోక్కోడమే" "సాహసే లక్ష్మి" అంటూ నలుగురూ ఏకకాలంలో అందు కున్నారు.

చుక్కపొడిచింది.

చివరి కందరూ "గిత్తల నొకకంటితో కనిపెడుతూ వుండ వలసిందే" అనీ "మునిపటిలాగ విచ్చలవిడిగా తిరగనివ్వ కూడ" దనీ తేల్చి, ఆవులిస్తూ, ఎక్కడివా రక్కడికి వెళ్ళి పోయారు.

## ౨౭

సిరిదాముడు తిన్నగా గిత్తలున్న దొడ్డిదగ్గిరికి వెళ్ళాడు.

నిద్రరాక కొంజా అరుగుమీద పొరలాడుతూవుండిన గోవిందు "దొరా" అని పలకరించాడు.

సిరిరాము డరుగెక్కి చీడీలమీదికి కాళ్లుంచుకుని కూచో

డమూ, గోవిందు లేచివచ్చి చీడీలమీాద కూచోడమూ, ఏక కాలంలో జరిగిపోయాయి.

" నిద్ర లేదా ? "

" లేదు దొరా ఆందోళనగా వుంది. ఇక బతుకెందు కని పిస్తూ వుంది "

" గట్టిదెబ్బలు తగిలాయా ? "

గాయాలు పడలే దంతే. కొమ్ములతో కుమ్మాయి. పైగా నిలువెడెత్తునుంచి కిందపడడం. వొళ్లు హూనంహూనం అయిపోయింది ; కాని నా కందుకు విచారం లేదు దొరా "

" ఏమి గోవిందూ, యిలా జరిగిందీ ? "

" నే నేమి చెప్పను దొరా, సిగ్గుతో నేను మగ్గిపోతున్నాను. మొన్న నే గొప్పగొప్ప పందాలు గెలిచిన గిత్తలు—ఒకటికాదు, రెండుకాదు, ఏడుగిత్తలు — రెండుగిత్తలకు వోడిపోడం — ఇంత కంటే నాతల కొట్టేస్తే మంచిది కాదూ దొరా ? "

" విచారించకు, సింగన్న ముందు స్రుచ్చి కొట్టాడా ? "

" వాడేంకొడతాడు దొరా స్రుచ్చి, కొయ్యాయిపోయాడు గదా ? "

" ఏమి జరిగిందీ ? "

" వాడి గిత్తలను చూసీచూడ్డంతోనే మన గిత్తలు బుస్సుమన్నాయి. అందుకేవాడు కొయ్యాయిపోగా, ఝుమాయించి నేను స్రుచి కొట్టాను. వెంటనే మన గిత్తలు కొండలు విరిగి మీాద పడ్డట్టు పడిపోయాయి వాటిమీాద "

" కలపటం అయినా కయినా వాడు స్రుచి కొట్టాడా ? "

"లేదు దొరా, వాడు చచ్చిన శవంలా వుండిపోయాడు గుర్రంమీద, నమ్ము దొరా"

చూసిచూసి "ఇందులో యేదో కిటుకుంది. లేకపోతే, మనగిత్త లేమిటి వోడిపోడం యేమిటి? ఏమంటావ్?"

"ఇంకెందుకూ, కిటుకూలేదు పోటుకూలేదు, ఆగిత్తలపటిమే అలాంటిది దొరా! ఏమిసాహసం! ఏమిశౌర్యం! ఏమిచురుకు! ఏమి చాతుర్యం! ఏమి పోటు! సింహాలుకూడా అంత గొప్పగా పోరాడలేవంటే నమ్ము దొరా"

"ఎప్పుడూ అనుకోలేదు గోవిందూ. గిత్తలుకాదు. వోడిపోయింది నేను"

"సందేహమేం? కాని యీపుట్టిమునక యేమిటిదొరా?"

"అదే తోచడంలేదు. నీకు గట్టిదెబ్బలే తగిలినట్టున్నాయి"

"నాలెక్ఖేమిటిదొరా, దొడ్లోకి యెవడువెళ్ళినా చచ్చాడన్నమాటే. హిమాచలం కాలుబెణికాక గిత్తలు మరీ అగ్గయిపోయి వున్నాయి. అది కుంటుకుంటూ దొడ్డోకి వచ్చినప్పుడు, కోపం పట్టలేక, యివతల వున్న వాళ్ళనందర్నీ కుమ్మెయ్యడానిగ్గాబోలు, గిత్త లొక్కొక్క యెగు రెగిరితే-నారాజా, సింహాలెగరగలవా అలాగ? పెద్దపులులు గాండ్రించగలవా అలాగ?"

"ఇక ముందుమాట?"

"తెల్లవారనియ్యి దొరా"

"సరే, నువ్వుపడుకో, పొద్దుపొడిచాక వస్తాను"

"పడుకుంటాను గానీ - హయగ్రీవం దొరగారు వుపాయం పన్ని వుండకపోతే వూరంతా యీపాటికి నేలపట్ట మయిపోయి వుండును"

"అదేమిట్రా, హయగ్రీవం దొరగారి గిత్తల్ని కూడా పొడవలేకపోయావేం మనగిత్తలూ?"

"ఇక పొడవడం మాట తీసెయ్యదొరా, మళ్ళీ, యివి మనకి లొంగుబాటులోకి వస్తాయా?"

"సరే, నువ్వు పడుకో" అంటూ సిరిదాముడు వెళ్ళిపోయాడు.

గోవిందు మళ్ళీ నడుంవాల్చాడు.

౨౭

కుంభకుడు వెళ్ళిపడుకున్నాడే గాని నిద్రపట్టలేదు.

వెనకటి దినాల్లో అయితే, అతను శతరథుణ్ణీ, దండపాణినీ లేపి ఆలోచించి వుండును.

వయిసు వచ్చినా సిరిదాము డింకా కుర్రతనపు చేష్టలు మానకపోడం కూడా అతని కిప్పుడు బాగా గుర్తుకి వచ్చింది.

దీంతోనే అతను గజిబిజి పడుతూ వుండగా "ఏం, నిద్ర రావడంలేదూ?" అంటూ కళ్ళు నులుముకుంటూ వచ్చింది ధర్మద.

"ఒకటే నిద్ర. ఎటుచూసినా అడివి ముళ్ళాగా వుంది. పైగా యీ వుప్పెన" అన్నా డతను చిరాకుగా.

"ఏమంటారు?"

"ఏతగువూ లేకుండా మణిగ్రీవుణ్ణి తప్పించాలి. గిత్తల్ని లొంగతియ్యాలి. దెబ్బలుతినీ నష్టపడీవున్న వూరివారిని సమాధాన పెట్టుకోవాలి. ఏమిటిదారి?"

"నన్నా అడుగుతారు ?"

"ఇంకెందుకూ మరి ? వెళ్ళి పడుకో"

"ఇదెక్కడి వులకమమ్మా, యెక్కడా చూడలేదూ, ఇలా వచ్చిందీ మాకూ !" అంటూ ధర్మద అలాగే నుంచుంది.

మారుచెప్పకుండా కుంభకుడటుతిరిగి పడుకున్నాడు.

దానిమీాద, అసంతృప్తురాలై, పురపుర చూస్తూ "ఏదో వుపాయం చూసుకోవాలి, గాని, నామీాద చిరాకుపడితే యెలాగా ?" అని సాగతీసుకుంటూ ధర్మద వెళ్ళిపోయింది.

కుంభకుడు మళ్ళీ యిటుతిరిగాడు.

కొంతసేపు చేతిలో తలవుంచుకుని కళ్ళుమూసుకుని పడుకున్నాడు.

తరవాత లేచికూచున్నాడు.

కూచున్న క్షణానికి లేచి పచారు ప్రారంభించాడు.

పచారుచేస్తూనే వోమాటు, మధ్యమధ్య ఆగి వోమాటు, పక్కకిచూస్తూ వోమాటు. కిందికిచూస్తూ వోమాటు, మీాదికి చూస్తూ వోమాటు, కళ్ళుమూసుకుని వోమాటు, గోడకి చేరబడి వోమాటు - ఇలాకూడా అతను తీవ్రంగా ఆలోచించాడు గాని, అతనికేమీా పాలుపోలేదు.

బుర్రవంచుకుని, రెండుమూాడు మాట్లలాగా యిలాగా గబగబా తిరిగి, యూదాలాభంగా కిటికీ తెరచిచూడగా తూర్పు తెల్లవారుతున్నట్టు కనపడింది.

వెంటనే అంగాస్త్రం పైని వేసుకుని పటికిబయలు దేరాడతను.

* * *

పొద్దుపొడిచాటప్పటికి, గీరునామాలతో కొందరూ, విభూతి పెండెకట్లతో కొందరూ, అందరూ కోరసిగలతోనూ పిన్నలూ పెద్దలూ—గొల్ల లనేకమంది వచ్చి దొడ్డి చుట్టూమూగారు.

రొమ్ముల యెత్తుసవున్న గోడలమీాదినుంచి వచ్చిన వారందరూ చూసినకొద్దీ, ఒక్కొక్క కాలుదువ్వీ, ఒక్కొక్క రంకెవేసీ, ఒక్కొక్క యెగు రెగిరీ, తలుపులు బద్దలయిపోయే టట్టు ఒక్కొక్క తాకుతాకీ, గిత్తలు మహా చెలరేగాయి.

సాహసించి కొందరుగోడలెక్కారుగాని నిలవలేకపోయారు.

ఇంతలో "యేం కుంభకం బావగారూ, గిత్త లేంచేస్తున్నా" యనడుగుతూ హయగ్రీవుడు రాగా "మీాఅనుగ్రహం వల్ల దొడ్డి చేరుకున్నాయంతే. అల్లరిమాత్రం మానలేదు" అంటూ ప్రత్యుత్థానంచేసి, కుంభకుడు, అతణ్ణి దొడ్డిదగ్గిరికి తీసుకువెళ్లాడు.

వారినిద్దర్నీ చూసి పాతపగవున్నట్టు గిత్తలు మరీ చెల రేగాయి.

అదిచూసి "యేమి టంటూ వల్లుడా?" అనడుగుతూ శత రథుడు దగ్గిరికి వచ్చాడు.

"పిచ్చెత్తిం దనుకుకోవాలి"

"కారణం?"

"ఓడిపోడమే"

"ఓడినగిత్త లిలా చెలరేగడం యెక్కడయినా వుందా?"

"ఇది మన అదృష్టం"

"అయితే, తరవాయి?"

"ఏం బావగారూ, నాకుతోచింది మనవిచేసుకోనా?"

"మెల్లిగా అడుగుతున్నారా బావగారూ?"

"అయితే, ఆలకించండి రాత్రంతా నాకిదే ఆలోచన. చివ కీక తూర్పు తెల్లవారుతుం దనగా, గప్పున మెరుపులాగ తోచిం దొక వుపాయం"

"సెల విప్పించండి"

"గొల్లయువకు డెవరయినా గిత్తలను ఏవిధంగా అయినా సరే లొంగతీస్తే పెద్ద బహుమతీచేస్తానని చాటింపు చేయించండి"

ఇది విని అందరూ చకితులయినారు.

"బహుమతీ యేమిటో అదికూడా నువ్వే నిర్ధారణ చేసెయ్యవయ్యా" అన్నాడు శతరథుడు.

దానిమీద "ధర్మమా? నేను మనవిచేసుకున్న వుపాయం నచ్చితే బహుమతీ నిర్ధారణ చెయ్యదగ్గవారు మీరూ బావ గారూనూ" అన్నాడు హయగ్రీవుడు.

"ఏం, కుంభకం, ఏమంటావ్?"

"బావగారూ, మెరుపులాగ మీకుపాయం తోచింది. మెరుపులాగే నాకూ బహుమతీ తోచింది"

"సెలవిప్పించండి"

"గిత్తల్ని లొంగదీసిన గొల్లకి మా నీలనిచ్చి పెళ్ళిచేస్తాను. ఏం, ఎలావుంది?"

అంతవరకూ వూపిరిబిగపట్టుకునివుండిన గొల్ల లందరూ "భేష్, బలే, వా, సెబాస్" అంటూ మహోత్సాహంతో కోలాహలంచేశారు.

ఏమి జరుగుతోందో గుర్తించుకోలేనంతగా స్తబ్ధు డయిపో యాడు సిరిదాముడు.

"అయ్యో, నాగిత్తలూ" అంటూ మొగం వేలవేసు కున్నాడు గోవిందు.

"భేషుగ్గావుంది. దీనికి చాలినబహుమతీ భూమ్మీదలేదు. మీ రేమంటారు మామయ్యా"

"ఏం, కుంభకం, మళ్ళీ ఆలోచించు" అన్నాడు శతరథుడు దండపాణికేసి చూస్తూ.

దండపాణి ఆత్రంగా చూశాడు.

"ఇంకెందుకూ ఆలోచనా? నేను మాట అనేశాను. అదలా జరిగిపోవలసిందే" అన్నాడు కుంభకుడు దృఢంగా.

అందరూ శతరథునికేసి చూశారు.

తలపంకించి పంకించి "సరే నీయిష్టం" అన్నాడు శత రథుడు. వెంటనే చెయ్యూపి కోలాహలం ఆపి, కుంభకుడు "ఇదిగో, గొల్లలంతా ఆలకించండి. రేపు మధ్యాహ్నమే ముహూర్తం. బీదాసాదాభేదం చూడను. ఈగిత్తల్ని లొంగ తీసిన గొల్లయువకునికి నాకూతురు నీలనిచ్చి పెళ్ళిచేస్తాను" అని గొంతెత్తి మళ్ళీ చెప్పాడు.

మళ్ళీ కోలాహలం రేగింది.

ఆకోలాహలంలోనే "బావగారూ, గొల్లపల్లెలన్నీ చాటిం పుచేయించండి" అన్నాడు హయగ్రీవుడు.

"ఇక అదే తరవాయి. దండపాణిబావా, పందిళ్ళు వేయించు. నాయనా సిరిదామా, ఊరంతా అలంకరింపించు. బాబయ్యా, గొల్లయువకులు చాలామంది రావచ్చు, విడిదెలూ విందులూ ఏర్పాటు చేయించండి"

ఇలా అని "దయచెయ్యండి బావగారూ" అంటూహాయ గ్రీవుని చెయ్యిపట్టుకొని యిటోకి బయలుదేరాడు కుంభకుడు.

౨౬

"మంచియుక్తిచేశారు బావగా" రన్నాడు దండపాణి, శతరథు డింటోకి వచ్చాక.

"పిల్లవిషయమై యిక నోరెత్తడానికి వల్లకాదు. ఇప్పుడేమన్నా బయటపడిపోతాం" అన్నాడు శతరథుడు.

గిత్తల్ని లొంగతియ్యగల నంటా డబ్బాయి"

"వద్దనను; కాని లాభంవుండదు. అబ్బాయేకాదు, కృష్ణుడుతప్ప ఆపని మరెవ్వడూ చెయ్యలేడు"

"మానననంటాడు"

"మానడమేమిటి? గొల్లకులంలోపుట్టి — మూతిమీద మీసం —"

"అదే నావుద్దేశమూనూ. లొంగతియ్యలేకపోయినా అదే పౌరుషం"

"జయం వొక్కడికే; కాని చాలామంది ప్రయత్నిస్తారు, మానరు. అబ్బాయి ప్రయత్నించడూ? నువ్వూ నేనూ కూడా దద్దమ్మలం అనిపించుకుంటాం"

"ఈమాటే అన్నాడు అబ్బాయి కూడా"

"అదీ మగతనం"

* * *

"నాతో చెప్పకుండా యిలా చేశారేమండీ?" అనడిగింది ధర్మద.

"నే నిలా అనలేదనుకో. నువ్వేం చెబుతావో ఉపాయం చెప్పు" అన్నాడు కుంభకుడు.

"అలా నిలవతీస్తే నేనేంచెప్పగలనండీ ?"

"కూచో, ఆలోచించు, చెప్పు"

"సడే"

"నీచెయ్యీ నాచెయ్యీ దాటింది వ్యవహారం, యిక పూరుకో"

* * *

"గిత్తల కాళ్ళకింద పడిచావడం-లేదూ, గిత్తల్ని చంపడం. లొంగతియ్యడం అంటే యింతే"

"లొంగతియ్యలేకపోతే బతికినా చచ్చినట్టేలే; కానీ, యెవడయినా యీ పని చెయ్యగల డంటావా ?"

"చెయ్యలేడు దొరా"

"కృష్ణుడు బావో ?"

"కృష్ణుడుబావయితే మాత్రం ? ఏమిటేమిటో చేశాడంట, ఏదీ, మరి మనగిత్తల దగ్గిర నిలబడమనూ చూస్తానూ" అంటూ వూగిపోయాడు గోవిందు.

"మాటవరసకి. నిలబడతా డనుకో, లొంగతీస్తా డనుకో, అప్పుడు ?"

వెన్ను విరుచుకుంటున్నవాడల్లా యేసుపుమొగం పెట్టుకుని "సింగన్న యెదట నేను బతకలేనుదొరా, అందుకోనం యేసు స్తున్నాను దొరా !" అంటూ చేతులు తేలవేసుకున్నాడు గోవిందు.

"స్స!.........ఉక్కుతునకే అనుకో. అయితేమాత్రం యేదుగిత్త లొక్కమాటు మీదపడితే—"

"పిప్పిపిప్పయిపోదూ?.........చూడూ దొరా, నీకు బెంగ అక్కర్లేదయ్యా! ఈపందెమూ తుదనెగ్గదూ, ఈజన్మలో నీలమ్మకి పెళ్ళీకాదూ, ఊరుకో"

"అయితే, మూడో మేలు"

"ఏం, మాటలకున్నా వేమిటయ్యా? కష్టపడి నా చేతులతో పెంచాను. పందెం వేశాడేగాని, గిత్తల సత్తువ యేం తెలుసు పెద్దదొరకి?" అంటూ మీసంమీద చెయ్యివేసుకున్నాడు గోవిందు.

"పిల్లంగోరూది ఆవుల్నీ యెడ్లనీ మచ్చికచేసుకోడం కాదు. హే"

"ఓయి వెర్రిబాగులదొరా! గొల్లభామల రుచిమరిగిన వాడు యుద్ధం చెయ్యగలడంటయ్యా?"

"అదీమాట"

"పదిమాటలెందుకూ? ఒక్కమాట వినుదొరా! బతకతలుచుకుంటే మీకృష్ణుడు బావ రానేరాడు. వచ్చాడూ? ఊరికే వెళ్ళడు"

దీనిమీద పళ్ళుకొరుకుతూ "తాపులుతిని — కుమ్ములు పడి —" అంటూ వూగిపోయాడు సిరిదాముడు.

"ఒక్కగిత్త తోక ఝూడిస్తే చాలదటయ్యా మనిషికీ? ఇంతకీ! సింగన్నయినా చస్తాడు, నేనయినా చస్తాను. అందుకోసం వచ్చిం దిది. నీకెందుకూ బెంగ? వెళ్ళు"

"గిత్తల్ని బాగామేపు, ఎవడు వస్తాడో లొంగదియ్యడానికి చూస్తాను"

"గోడమీదినించి బుట్టతో గుగ్గిళ్ళు దింపాం. కమ్మగా తిన్నాయి. గడ్డిమోపులు పడేశాం. పీకలమొయ్యా మేశాయి. గిన్నెలతో నీళ్ళు దింపాం, కడుపునిండా తాగాయి. ఇప్పుడు కమ్మగా కునుకుతీస్తున్నాయి; కాని మనిషి అలికిడి అయితే మాత్రం యెగిసిపడుతున్నాయి"

"సరే, జాగ్రత్తగా చూస్తూవుండు"

* * *

"బలరామన్నా, తమ్ముడెక్కడున్నాడు నాయనా?" అనడుగుతూ వచ్చింది యశోద, చేతిలో వుత్తరం వుంచుకునీ.

"ఇక్కడే ఉన్నాడమ్మా" అని తల్లికి బదులుచెప్పి, పక్కకి చూస్తూ "తమ్మూ" అని పిలిచాడు బలరాముడు.

"ఆ, ఆ, వచ్చె" అంటూ వచ్చి "తొందరా?" అంటూ బలరాముణ్ణీ "తమరు పిలిచారా అమ్మా?" అంటూ యశోదనీ అడిగాడు జయంతుడు.

"ఏంచేస్తున్నాడు నాయన?"

"రాధమ్మగారు బుడిగావుపాలు పితుకుతున్నారు, కృష్ణుడు పుచ్చుకుంటున్నాడు, అయిపోవచ్చిందమ్మా"

"మీరు పుచ్చుకున్నారా నాయనా?"

"పుచ్చుకున్నానమ్మా"

"ఇంతలో నువ్వోమాటు బాబయ్యని తీసుకురా నాయనా" అంది యశోద బలరామునితో.

బలరాముడలా వెళ్ళాడు, మాటి తుడుచుకుంటూ కృష్ణుడిలా వచ్చాడు.

"అత్తయ్య వుత్తరం రాశారు నాన్నా"

"ఏ అత్తయ్యమ్మా?"

"ధర్మద అత్తయ్య. నేను చెప్పలేదూ?" అని కృష్ణుణ్ణీ "అంతేనా అమ్మా?" అని యశోదనీ అడిగాడు జయంతుడు.

"అంతే"

ఇంతలో నందుడూ, బలరాముడూ వచ్చారు.

"పొలం వెళ్ళబోతున్నాను?" అన్నాడు నందుడు.

"వెతుదురుగాని" అంటూ నందున కుత్తరం అందించి "ధర్మద వదిన రాశారు" అంది యశోద.

"ములుకులే వున్నాయో, క్షేమసమాచారాలే వున్నాయో వుత్తరంలో, చదివించండి" అంటూ నందుడు వుత్తరం జయంతున కిచ్చాడు.

ఉత్తరం అంతా వోమాటు కలయజూసి జయంతుడిలా చదివాడు.

"మహాలక్ష్మీ సమానురాలు యశోదమ్మ వదినగారి సన్నిధిని, విధేయురాలు ధర్మద దణ్ణాలు సమర్పించుకుని విన్నవించుకునే సంగతులు.

ఇక్కడ మేమందరమూ క్షేమం. అక్కడ మీఅందరి యోగక్షేమాతిశయాలూ తరుచు రాయిస్తూ వుండకోరినాను.

ఏమిచెప్పుకోను వదినా! మాగిత్తలేడూ చెలరేగి, నిన్న సాయంత్రమూ, రాత్రీ నానా అల్లరీ చేశాయి. ఊరంతా

గగ్గోలుపడిపోయింది. చివరికి హయగ్రీవం అన్నయ్యగారి ధర్మమా అని గిత్తలన్నీ దొడ్డికి చేరుకున్నాయి. అయినా అవి, యిప్పటికీ అల్లరి మానలేదు. మనస్సు పట్టలేక దొడ్లోకి వెళ్ళిన పెద్దపాలికాపుని కుమ్మి యెత్తి యివతల పడేశాయి. మనస్సు అనేకవిధాల గజిబిజి అయిపోయింది. దారీ తెన్నూ తోచలేదు. హయగ్రీవం అన్నయ్య వుపాయం చెప్పగా, చివరికి, మీఅన్నయ్య, అమ్మాయి నీలకు స్వయంవరం చాటించారు. గిత్తల్ని లొంగదీసిన గొల్ల యువకునకు నీలనిస్తామన్నారు. ఈవిధంగా నేను పెద్దవూబిలో దిగబడిపోయాను. నాకు మనస్సు మనస్సులోలేదు. ఉత్తరంరాస్తున్నానేగాని, ఏమి రాస్తున్నానో కనపడ్డం లేదు. తప్పులుంటాయి, మన్నించండి.

ఇక యిప్పుడు నావిన్నపం యేమనగా? అల్లుళ్ళ నిద్దర్నీ వెంటపెట్టుకుని మీరు వెంటనే బయలుదేరి రావాలి. రేపు మధ్యాహ్నమే స్వయంవరం. ఈరాత్రికే మీరిక్కడ వుండాలి; కనక, పాలకీ పరివారమూ పంపించుకుంటున్నాను. మీరు వచ్చి ఆసరా అయేదాకా నాకు నిద్రాహారాలు సయించవు. ఎదురుచూస్తున్నాను. నేనేవచ్చి మిమ్మల్ని తోడితెచ్చుకోవలసింది. ఈవుత్తరం మరోవిధంగా కూడా రాసివుండవలసింది; కాని దేవుడు నన్నీవిధంగా పరీక్ష చేస్తున్నాడు. మీరు నా అసహాయస్థితి గమనించాలి.

మహామేరు సమానధీరులయిన నందు డన్నయ్యగారి పాదపద్మాల సన్నిధిలో, ఇదే నావిన్నపం అని విన్నవించండి. చెల్లెమ్మ రాధకిన్నీ వుత్తరం రాసుకున్నాను. పాలకీ పంపు

తున్నాను. రోహిణి వదినగారికిన్నీ రాసుకున్నాను. కోడలికీ ఆమెకీ కూడా పాలకీలు పంపుకుంటున్నాను.

వదినా, ఈస్థితిలో, నేనింతకంటే మీకేమి రాసుకోగలను? కనక, మరోలా అనుకోవద్దని వేడుకుంటున్నాను.

మీకోసమూ, ముందు మీ ప్రత్యుత్తరంకోసమూ ఎదురు తెన్నులు చూస్తున్నాము.

చిన్నల్లుడు జయంతు డయ్యవారిని మరిచి పోడనిన్నీ నమ్ముతున్నాను.

మీ సేవకురాలు

భ ర్మ ద"

ఒక్క-క్షణం అందరూ గంభీరంగా చూసుకున్నారు.

తరవాత, ముందుగా జయంతుడు ఉత్తరం యశోద కిచ్చాడు.

"ఏంనాయనా. వెళ్ళడమేనా?" అడిగాడు కృష్ణుణ్ణి నందుడు.

"అయ్యో అదేమిటండీ అలా అంటారూ? నాయనా, నేనీరాత్రికే వెళ్ళిపోతున్నాను. మీరంతా రేపురండి" అంది యశోద.

"ఇక్కడి వ్యవహారం తొందరగా తేల్చెయ్యి, ఈపాటికి ఎగిరి వచ్చేస్తూ వుంటుంది భద్ర" అన్నాడు కృష్ణునితో జయంతుడు, జనాంతికంగా.

"నడిచివెడితే ఎలాగేనా ఆలస్యం తప్పదు. నువ్వు వెళ్ళి గుర్రాలను సిద్ధం చేయించు" అన్నాడు కృష్ణు డలాగే.

"బలరామన్న కూడా వెంటబడతాడేమో?"

"రాడు, రానివ్వడు"

జయంతుడు బయటికి వెళ్ళాడు.

కృష్ణుడు బలరాముని కేసిచూసి వూరుకున్నాడు.

"తమ వుద్దేశం —" అని నసికాడు సందుడితో బల రాముడు.

"సిరిదాముడు మర్యాద అతిక్రమిస్తాడేమో అని సందేహిస్తున్నారా మీరు?" అనడిగాడు నందుడు.

"అయ్యో, అదేమిటండీ? కుర్రనాగమ్మ అతని కేమితెలుసునండీ? ఈపాటికి మా అన్నయ్య కూకలేసి వుండరుటండీ?" అంది యశోద, పులుకూ పులుకూ చూస్తూ.

"పిల్లకోసం కాకపోతేమానె, పౌరుషానికయినా వెళ్ళాలి, మనం, అంతేనా బాబయ్యా?" అనడిగాడు బలరాముడు.

"అదే నేను చెప్పవచ్చేది"

"అమ్మని కూడా అడుగు" అన్నాడు కృష్ణుడు జనాంతికంగా.

"ఏమమ్మా, అంతేనా"?

చూసి చూసి "మీరు పౌరుషానికేరండి. నేనుమాత్రం వియ్యానికి వెడతా" నంది యశోద.

"భారంఅంతా నీమీద వేసుకుంటే, నేను చేతు లూపుకుంటూ వస్తాను విందులికీ, బహుమతీలకీనీ" అన్నాడు నందుడు.

"మీకేం ఆలోచనలమీద ఆలోచనలు చేసుకోండి. అయ్యవారు కనిపెట్టుకున్నారు, మావదినకి బదులు రాసి పంపాలి నేను" అంటూ యశోద వెళ్ళిపోయింది.

"ఏం నాయనా, మనం యెప్పుడూ వెళ్ళడం"?

"ఆలోచించండి అన్నయ్యా"

"నువ్వు బీట్లోకి వెళ్ళాలా?"

"వెళ్ళాలి"

"రేపటిమాట కదా పదండి బాబయ్యా"

"ఏటావలికా ముందు, గరువుమీదికా?"

"ఏటావలికే"

## 30

కృష్ణుడూ జయంతుడూ ఇలా వచ్చి గుర్రాలు దిగారు. భద్ర అలావచ్చి గంప దింపుకుంది.

"పెళ్ళికొడుకు వయినావే కృష్ణా" అందామె కులుకుతూ.

"అయితే, కన్నెపిల్ల కాలు తొక్కి-స్తా వన్నమాటే నువ్వు" అన్నాడు జయంతుడు.

"బేరమాడే వచ్చావుగా అయ్యవారూ? కాని, కృష్ణా! నువ్వేం చేస్తావో చివరికి?"

"మీానీల యేమిచేస్తుందో చివరికి?"

"ఆరు నూరయేది, నూరు ఆరయేది. నిన్నుతప్ప మరో కణ్ణి పెళ్ళాడదు మానీల. నమ్ము కృష్ణా!"

"మాకృష్ణుడు నీలనే పెళ్ళాడతాడు నువ్వు నమ్ము భద్రా"

"ఏం, కృష్ణా, నువ్వనవేం ఆమాటా?"

"మా మామయ్య పందెం వేశాడు, ఎరగవా భద్రా?"

"ఎరక్కేం కృష్ణా? అందుకే నేనడగడం. పెద్దలూ పెద్దలూ

ఏమి చేసుకుంటారో గాని, ఏమి నలిగిపోతాం దయ్యా నీకోసం మాపిల్ల! మరొక డెవడయినా గిత్తల్ని లొంగదియ్యాడమే వస్తే, నుయ్యో గొయ్యో చూసుకుంటుంది; గాని దేవుడు దిగివచ్చినా పెళ్ళాడుతుం దంటయ్యా?"

"చిత్రం చూశావు కృష్ణా? తండ్రిచూపు వేరు. తాతచూపు వేరు. కొడుకుచూపు వేరు. కూతురిచూపు వేరు. తల్లి చూపు —"

"గిత్తల చూపు వేరు"

"అదిగదీ! ఉన్నమాట అన్నావు కృష్ణా! అవేంగిత్తలయ్యా, సమయానికి చెలరేగాయి?"

"మీనీల ఆవులుపెట్టిన గిత్తలేగా అవి?"

"పెంచిన మమకారం అయినా చూపకుండా, ఎంత అల్లరి చేశాయి కృష్ణా నిన్న?"

"నీకేమీ నష్టం కలగలేదుగదా భద్రా?"

"లేదు కృష్ణా, లేదు. మానాయ డిలా కావడి దింపాడు, నేనిలా గంపదింపాను, వీధిలో గొల్లుమన్నారు, చూస్తినిగదా, పిల్లలనిలేదు. ఆడాళ్ళనిలేదు, ఆవులనిలేదు, — కళ్ళబడ్డ ప్రాణినల్లా, తుక్కుతుక్కుచేసేశాయి గిత్తలు. ఎంతమంది నలిగిపోయారు కృష్ణా?"

"మీసిరిదాముడుదొరగారి ప్రతాపం అలా వెలిగిపోయింది"

"వెలిగినంతకాలం వెలిగింది; కాని కత్తివేస్తే మొగాన నెత్తురుచుక్క లేదివాళ. మొగం పైకెత్తితే వొట్టు. బొత్తిగా పెళ్ళికూతు రయిపోయా డయ్యా మొనగాడు"

"ఎవడు పెళ్ళాడతాడో చివరికి?" అన్నాడు జయంతుడు.

"అయ్యవారి వేళాకోళాల కేం గాని. అనువూ మినువూ చెప్పవేం కృష్ణా నువ్వూ?"

"నీఆజ్ఞ ప్రకారం మసులుకోడం తప్ప నే నేం చెప్పగలను భద్రా?"

"అయితే, నువ్వు వచ్చితీరాలి"

"వస్తాను"

"గిత్తల్ని లొంగతియ్యాలి"

"అది నీ ఆశీర్వచనంవల్ల కావలసిన పని"

"అయితే, యిదిగో నా ఆశీర్వచనం"

ఇలా అంటూ, గంపలోనుంచి బంగారపు గిన్నె తీసి అందించింది భద్ర.

కృష్ణుడు చూసి వూరుకున్నాడు.

"భద్ర యిట్టే మార్చేస్తుం దయ్యా మాట" అన్నాడు జయంతుడు.

"నేనేం మార్చా నయ్యవారూ?"

"నీ ఆశీర్వచనం అది కాదిదీ" అంటూ గంపలో చెయ్యి పెట్టి వొక పెరుగుముంత తీసుకున్నాడు కృష్ణుడు.

దానిమీద, భద్ర, గిన్నె వెంటనే కిందవుంచేసి, ఆముంత పట్టుకుని "అదికాదు కృష్ణా! అది అమ్మకం పెరుగు కృష్ణా! అదినువ్వు పుచ్చుకుంటే నన్ను చంపుకుతిన్నట్టే కృష్ణా" అంటూ పెనగులాడింది.

"మాట వినిపించుకో, ముంత విడిచిపెట్టు"

"ఏం మాట కృష్ణా ?"

"విడిచిపెట్టు ముందు"

భద్ర విడిచిపెట్టింది.

వెంటనే కృష్ణు డా పెరుగు గడగడ తాగేశాడు.

"నేను చచ్చిపోయాను కృష్ణా" అంటూ దేవుళ్ళాడింది భద్ర.

"లేదు కృష్ణా, భద్ర అబద్ధా లాడుతోంది"

"నేను చచ్చిపోవా లనుందా అయ్యవారూ నీకూ ?"

"ఆమాట నన్నడుగు" అన్నాడు కృష్ణుడు.

"నిన్నడగను"

"పోనీ, మీాసిరిదాముడు దొరగారిని — "

"జయంతా, నువ్వూరుకో. భద్రా, నువ్వొట్టి వెఱ్ఱి బాగులపిల్లవు. నానీల అనుకున్న మీానీల నాకిప్పుడు మేన మామ కూతురు, అంతే. మీానీలని మీాసిరిదాముడు అంగడిలో పెట్టాడు, కనక, గిత్తల్ని యెవడు లొంగదీస్తాడో వాడూ ఈ గిన్నెలో పెరుగు పుచ్చుకోవలసినవాడు"

"నన్నిరుకున పెట్టావు కృష్ణా! మరి నీల కేమిటీ చెప్పడం?"

"నేనూ వస్తాను, ఇంతేచెప్పు"

"తెల్లవారాటప్పటికి రావాలి"

"రాను"

"జాముపొద్దెక్కేటప్పటికి"

"రాను"

"పోనీ, భోజనాల వేళకి, ఏం ?"

" రాను "

" అయ్యో "

" మొనగాళ్ళందరూ సభలోకి వచ్చాటప్పటికి నేనూ వస్తాను. వస్తాను, నాదాకా మిగిత్తే గిత్తల పనిచూస్తా నంతే. ఈలోపున మీాసిరిదాముడు దొరగారున్న చోట గాలిఅయినా పీల్చను "

చూసిచూసి " ఏనుగునయి వచ్చాను, కృష్ణా, కాని, పీనుగునయి వెళుతున్నాను. ఇక నీ దయా మా ప్రాప్తమూానూ " అంటూ లేచి, "ఎంత క్షోభ పెట్టావయ్యా సిరిదామా" అంటూ గిన్నె గంపలోపెట్టు కుని మొత్తుకుంది భద్ర.

లేచి, దగ్గిరికి వెళ్ళి " దినమ్మూా నువ్వింత కష్టపడడం నేను చూడలేకుండా వున్నాను భద్రా " అన్నాడు కృష్ణుడు.

" ఇంటోవుండి నీలమెంత అవస్థ పడిపోతోందో అది చూడవు గానీ... "

" నువ్వు సిరిదాముడు దొరగారిని పూసుకువస్తావు గానీ-" అంటూ బెల్లిస్తూ చూశాడు జయంతుడు.

" కృష్ణా, కృష్ణా, కృష్ణా " అంటూ అడుగు వేసింది భద్ర.

" ఆమాట యికచాలు. రంగాపురంలో పెరుక్కి బదులు కృష్ణుణ్ణే అమ్మేస్తావేమోం కొంపతీసీ-" అన్నాడు జయంతుడు.

భద్ర వెళ్ళిపోయింది.

* * *

మిథిల అంతా చక్కగా అలంకరించారు.

పందిళ్ళతోనూ, తోరణాలతోనూ ప్రతీయిల్లూ పెళ్ళి యిల్లులాగ గుమ్మగావుంది.

ఊరంతా పొరుగూళ్ళ స్త్రీ పురుషులతోనూ, ఊరిబయళ్ళన్నీ వారెక్కి వచ్చిన బళ్ళతోనూ నిండిపోయాయి.

జాముపొద్దెక్కేటప్పటికి పెళ్ళికొడుకులొక్కొక్కరే సాగారు.

మొదటివాడు నాలుగు కాళ్ళమెద్దు కట్టిన బండిమీద వచ్చాడు.

"వయస్సు ముదిరిందే" అందొక ప్రౌఢ.

"బండిలో నలుగురు పెళ్ళాలూ వున్నారో లేరో చూడవూ" అందామెని మరో ప్రౌఢ.

రెండోవాడు పాలకీమీద వచ్చాడు.

"గున్న యేనుగులా వున్నాడుకదే" అందొక ప్రౌఢ.

"మొదటిపెళ్ళాం యేనుగేసి తొంగబెట్టుకుందో" అంది ఆ మోన మరో ప్రౌఢ.

మూడోవాడు గుఱ్ఱంమీద వచ్చాడు.

"ఆహా! ఆహా! ఇంద్రుని గుఱ్ఱాన్ని మించివుందికదే గుఱ్ఱం" అంది ఒకామె.

"ఓహో, ఓహో, దాని సకిలింపుని మించివుంటుందికదే అతనినవ్వు" అంది మరోకామె.

నాలుగోవాడు లొట్టిపిట్టమీద వచ్చాడు.

"చక్కంగా వున్నాడు, ఒంటెమీద వచ్చాడేమే?" అందొకామె.

"అతగాడు వొంటెత్తు మనిషిలే" అంది మరోకామె.

అయిదోవాడు దున్నపోల బండిమీద వచ్చాడు.

"ఆమొప్పాలు పారిపోకుండా వుండడానికి ఇల్లంతా అడిపిలూం వుంచుకుంటూ చెప్పావూ" అంది ఒపూరిపిల్ల.

ఆరోవాడు నడిచి వచ్చాడు.

"పెళ్లాన్నికూడా నడిపిస్తాడు కామోసు గదే!" అంది వొకామె.

అతని వెనకే వచ్చిన మరోప్రౌఢ "మంచమనే నిద్రపోతాడు సూమరిది, నువ్వేం చూశావ్?" అనడిగింది.

ఏడోవాడు తానే బండీతోలుకుంటూ వచ్చాడు.

"పాలికాపుని బండిలో పరుపుమీద కూచోబెట్టాడే" అందొకప్రౌఢ.

"నువ్వేం చూశావ్? ఒక్కొక్కప్పుడు పాలికాపు బండిలో గుప్రతీస్తూ వుంటాడు, పగ్గాలుపట్టుకుని ముందు నడుస్తూ వుంటాడు నానాయన" అంది మరోప్రౌఢ.

ఎనిమిదోవాడు ఏనుగు నెక్కివచ్చాడు.

"ఊత్తే యెగిరిపోతాడుగదే నాయన?" అందొకప్రౌఢ

"అంచేతనే యేనుగెక్కాడు" అంది పక్కనున్న ప్రౌఢ.

తరవాత, శతరథుడు చాలాసేపు కనిపెట్టుకుని వుండినాడు కాని మరి పెళ్ళికొడుకులు రాలేదు.

వచ్చిన యెనమండుగురినీ మాత్రం యెప్పటికప్పుడే దండపాణి, గిత్తల్ని చూపించి, విడిదెలలో ప్రవేశపెట్టాడు.

౩౧

"క్షణానికో క్షణానికో సభలోకి వెళ్ళాలి; కాని యిప్పటికీ భోజనం చెయ్యేదంట అమ్మాయి" అంది వుసూరుమంటూ వచ్చి ధర్మద.

"ఏం, వ్రతమా? పురోహితుడయ్యవారు వల్లకావన్నారటనా?" అనడిగింది యశోద.

"అదేమీలేదు వదినా! వద్దంటుంటానంతే, కారణం చెప్పదు"

"అన్నయ్య చెప్పి చూశారా?

"అదీ అయింది. 'వద్దండీ బాబయ్యా' అనేతప్ప మరో మాటలేదు"

వినివిని "పిల్లకి నీరసం చేస్తుందనుకుంటాం మనం కాని, నిజానికి వల్లమాలిన ఆందోళన వదినా! నోటికి పోదు, ఎందుకూ వొక్కక్షణం. రాత్రి పెళ్ళికొడుక్కీ పెళ్ళికూతురికీ ఏకబంతి వేద్దాం, వూరుకో వూరుకో" అంది చివరికి యశోద.

* * *

"నామాటవినుః కసింత ఎంగిలిపడమ్మా! సభలోకి రాగలవా లేకపోతే?"

"సభలోకి రావాలో అక్కర్లే లేదో?"

"అంతే? నేనబద్ధం చెప్పాననే?"

"నిన్ను నమ్మకపోలేదు భద్రా! ఎంతసేపు చెయ్యాలీ భోజనం? ఇలా వచ్చాడని తెలిస్తే అలా కంచందగ్గిర కూచుంటాను, సరా?"

"సింగన్న వస్తున్నాడు వెళుతున్నాడు. అప్పుడే రెండు మాట్లు తిరిగాడంట గుర్రంమీద. సమయం అయిందంటే గుర్రందిగుతాడు, నొగలెక్కుతాడు. అక్కడ బండెక్కడమూ యిక్కడ దిగడమూనూ, సద్దుకుని కూచునీదాకా వుంటాయూ ఆగిత్తలు?"

"బయలు దేరాకా, ఆమాట"

"నిన్న రాత్రి యశోదమ్మత్తయ్యతోనూ రాక, ఇవాళ పొద్దున్న రోహిణమ్మత్తయ్యతోనూ రాక, రాధమ్మపిన్ని ఇప్పుడిప్పుడు వచ్చిందంటే ఏమిటి అర్థం ?"

"ఏమిటి అర్థం ?"

"బాఃని చక్కంగా అలంకరించి, బండిపూన్పించి వుంచి సంధ్యే అనేటప్పటికి బండెక్కమందని కాదూ ?"

"భద్రా, నేను వెంకితనం చేస్తున్నాననుకోకు, నేనెంత బాధపడుతున్నానో—"

"ఎంత ధైర్యం వుండబట్టి నేనిలా చెబుతున్నానో-"

"బావ వస్తాడని నీకు ధైర్యమూవుంది, నామీద ప్రేమా వుంది, కాని, నోటికి పోతుందో లేదో ఆ ఆలోచన మాత్రం లేదు"

"పోనీ, కసిన్ని పాలచుక్కలు — "

"బావ వచ్చాడన్న వార్తా, పాలగిన్నీ వొక్కమాటే తీసుకురా"

* * *

"ఏం, అంతచిరాకుగా వున్నావేం ?" అనడుగుతూ వచ్చాడు సిరిదాముడు.

"చిరాకు కాక ! అప్పుడే రెండుమూట్లు వచ్చాడు సింగన్న, గుర్రంమీద మహారాజులాగ నిక్కికూచుని. రెండుమాట్లూ నాకళ్ళబడ్డాడయ్యా శనిగాడూ, నాకడు పెంత తరుక్కుపో తోందో, నావొళ్ళెంత కాలిపోతోందో, నాతలకాయ ఎంత

పగిలి పోత్తోందో —" అంటూ, మరిమాట్లాడ లేక నెత్తి బాదుకున్నాడు గోవిందు.

"వాడి సిగ్గోసిన సింగన్న కాసి —"

"నీకలాగే వుంటుం దయ్యా! నాగలెక్కుతాడు, పగ్గాలు పట్టుకుంటాడు, మీసం మెలేసుకుంటూ బండితోలుకువస్తాడు వాడు, దంభోళీ శతకోటీ నచ్చాయంటే లక్షలాది జనం విరగబడతారు, పొగిడేస్తారు. అప్పుడు వాడెలా వుంటాడు? చిరునవ్వునవ్వుకుంటూ, అరగళ్ళతో చూస్తూ, తల సుతారంగా యెగరవేసుకుంటూ — అబ్బా, నేను బతకలేనయ్యా"

"మరి నామాట? లెక్కలెందుగిత్తలతో నాగిత్తల్ని పోడిపించాడు, మాచెల్లెలికోసం వస్తాడు —"

"కృష్ణమూర్తిదొర నెగ్గితే కదయ్యా, నీకుబాధా?"

"నెగ్గుతాడూ? హుహు. అప్పుడే పదకొండుగురు పెళ్ళిచ్చారు తెలుసా? వారందరూ చేతగానివాళ్ళే?"

"చేతకానివాళ్ళు కాక, నాగిత్తల్ని లొంగతీస్తారేం?"

"హే, పదకొండుగురుకాదు, డెభ్భయిపదకొండుగురు రానీ, నాకేమీ భయంలేదు. ఈనెప్పుల్ల వొకడూ — పూరబంది వొకడూ — పొట్టిపిచికి వొకడూ — ఛీ!"

"వాళ్ళవల్ల కాదంటావా?"

"వాళ్ళే వొప్పుకుంటారామాట, నిలవతీసి అడిగితే. ఇక లొంగతీసినా మానినా కృష్ణమూర్తిదొరే"

"ఛా ఛా, నేనొప్పుకోను"

"చూడూ, నీలమ్మకి పెళ్ళికానీ మాననీ. కృష్ణమూర్తి

దొరికే లొంగతియ్యలేకపోతే — నారంగా, చచ్చాడన్నమాటే
సింగన్న, నుంచున్నపాట్న"

* * *

"ఏం, వచ్చాడటనా ?" అనడిగాడు శంకరం.

"వచ్చిన జాడలేదు" అన్నాడు దత్తయ్య.

"వస్తా డటనా ?"

"రాడని చెప్పుకోడం లే దెవరూ"

"ప్చ్ ! ఈమాత్రం సంగతి తెలుసుకోలేకపోయావు, ఆవలిస్తే పేగులు లెక్కపెడతా నంటావు మళ్ళీ"

"నా తెలివి తేటలు నాబుర్రలోవుండనియ్యి, కృష్ణుడు రాడని నీబుర్రలో అనుకో. గిత్తల్ని లొంగతియ్యగలవా నువ్వు ?"

"నాసొమ్ముతిని నన్ను లోకువచేస్తున్నావా ? — పోనీ కృష్ణుడు లొంగతియ్యగలడేం ?"

"పదకొండుగురు మొనగాళ్ళేమీ చెయ్యలేకపోతే — వస్తేగిస్తే — అప్పుడూ కృష్ణునిమాట"

"అప్పుడయితే మాత్రం ? కృష్ణుడు లొంగతీసెయ్య వలసిందే ?"

"లొంగతియ్యగలిగితే ? ... ఏమిటో చెప్పు"

"వల్లకాదు, కట్టిపెట్టువేషాలు. మే మేమయిపోతామో పోతాం, నీకక్కర్లేదు. కృష్ణుడు లొంగతియ్యలేక తెల్లమొగం వెయ్యాలి. అది నేను చూడాలి. అందరూ కృష్ణుణ్ణి లేవిడీలు కొట్టాలి. అది నేను వినాలి"

* * *

"ఆయన మీతో మాట్లాడతా డంట" అన్నాడు నౌకరు వచ్చి.

"ఎవ రాయన?" అనడిగాడు దేవమీాధుడు.

"ఎదటి గదిలో దిగినాయన"

"మనతో పోటీకి వచ్చిన వాడితో మాటలేమిటి పొమ్మనరా"

"చాలా అవసరమైనమాట లున్నాయంట"

"పూర బందిలా వున్నాడు. చూడ్డానికే అసహ్యాం. పొమ్మనేస్"

"నువ్వు మహోముద్దొస్తున్నావా?" అంటూ తోసుకు వచ్చాడు గజపతి.

"నా సెలవు లేనిదే లోపలికి రావడాని కెవడి కధికారం వుందీ? గెంటెయ్యవేం?" అంటూ నౌకరుమీాద ధాము ధూములు చేశాడు దేవమీాధుడు.

"నువ్వు కిక్కురుమనక్రవు. నీసెలవు గడ్డిపరక. ఎగిసిపడ్డా వంటే పళ్లుకుక్కన విరిచేస్తాను, ఉఫ్‌న వూదేస్తాను"

"కారుదున్న పోతులా మాట్లాడుతున్నావు నువ్వు, నీతో నేను మాట్లాడను."

"గిత్తల్ని లొంగతియ్యడానికి వచ్చావంట, ఏదీచూతాం" అంటూ గజపతి, మీాదిమీాదికి వెళ్ళగా "ఛాఛా, నేను గిత్తల్ని లొంగతీస్తాను; కాని దున్నపోతుల్ని కాదు" అంటూ దేవమీాధుడు బయటికి వెళ్ళిపోయాడు.

* * *

"మీ కిదే మొదలా ?" అనడిగాడు ఘోషవంతుడు.

"అవునండీ" అన్నాడు దేవలుడు.

"ఏం, ఇన్నాళ్ళూరుకున్నారేం ?"

"ఊరుకోలేదండి, గట్టిగానే ప్రయత్నించాను"

"ఏమి జరిగిందీ ?"

"మా అమ్మగారొపిల్లని చూశారు. మా బాబయ్యొక పిల్లని మాట్లాడారు. నే నోపిల్లమీద కన్నేశాను. ఎన్నివిధాల తంటాలుపడ్డా మాకు తెగలేదు. ఇంతలో ఆముగ్గురు పిల్లలూ కాపరాలకి వెళ్ళిపోయారు"

"ఎన్నాళ్ళ కిందటి మాట యిది ?"

"నాలుగేళ్ళయింది"

"మళ్ళీ ప్రయత్నించలేదా ?"

"ఏమిటోనండీ, లోకంలో సరయినపిల్లే కనపడదండీ"

తలపంకించి వూరుకున్నాడు ఘోషవంతుడు.

అప్పుడు "మీకిదే మొదటిది కాదేమో ?" అన్నాడు దేవలుడు.

"కాదులెండి"

"ఎందరున్నారు భార్యలు ?"

"నలుగురు"

"మళ్ళీ ప్రయత్నాని క్కారణం ?"

"ఒకటికాదు, రెండున్నాయండీ"

"అవేమిటో అడగవచ్చునా ?"

"మూతిమీదవున్నది మీసంకదా 'ఏదీ, గిత్తల్ని లొంగ తియ్యా' అంటే చూస్తూ వూరుకోనా ?"

"సెభాస్! పిల్లదొరకనివ్వండి, దొరక్కపోనివ్వండి, నేనూ అందుకే వచ్చాను"

"ఇక రెండు, నాకయిదువందల పుట్ల భూమి వుంది. ముక్కా చెక్కా కిందవిడగొట్టడం నాకిష్టంలేదు. అయిదుగురు భార్య లుంటే కుటుంబానికి వందేసి పుట్ల భూమి ఇచ్చెయ్యవచ్చు చూడండీ"

* * *

దంభోళినీ శతకోటినీ పూన్చిబండి సిద్ధంగా వుంచా డొక పాలి కాపు.

జయంతుడూ, కృష్ణుడూ, బలరాముడూ కొంచెం యెడంగా నుంచుని వున్నారు.

"సింగన్న యెగిరి వచ్చేస్తున్నాడు దొరా" అన్నా డొక పరిచారకుడు వచ్చి,

అటుచూసి "తమ్ముడూ, ఏమిరొతూ సింగన్నా, ఎప్పుడూ చూడలేదే" అన్నాడు బలరాముడు.

"గుర్రం యింకా మంచిదయితేనా, అడిగావ్?" అన్నాడు జయంతుడు.

"వచ్చేశాడు" అన్నాడు కృష్ణుడు.

సింగన్నవచ్చి గుర్రందిగి "దొరా, బయలుదేరాలి" అన్నాడు.

"ఏమి జరుగుతోంది?"

"జనం మూగేశారు. పెద్దలంతా వచ్చేశారు. పెళ్ళికొడు కులు కాసెకోకలు బిగిస్తున్నారు"

"తరవాయి ?"

"ఇక్కడ మనం బయలుదేరడమూ, అక్కడ పెళ్ళి కూతురు పందిట్లోకి రావడమూనూ"

వెంటనే "జయంతా" అనిపిలిచి, అతనికి పాదాభివందనం చేసి "బండిలో అడుగుపెట్టు" అన్నాడు, కృష్ణుడు.

"శుభం" అంటూ జయంతుడు బండెక్కాడు.

"అన్నయ్యా" అంటూ పిలిచి, అతనికిన్నీ పాదాభివం దనంచేసి "బండెక్కండి" అన్నాడు కృష్ణుడు.

"శుభం" అంటూ బలరాముడున్నూ బండెక్కాడు.

"సింగన్నా" అని పిలిచాడు కృష్ణుడు.

"సిద్ధంగా వున్నాను వోరా" అంటూ, ఒకచెయ్యి నొగలిమీదా, రెండోచెయ్యి శతకోటిమీదా వేసి, మధ్యగా నుంచున్నాడు సింగన్న.

"తమ్ముడూ, నీళ్ళబిందె లెదు రవుతున్నాయి" అన్నాడు బలరాముడు.

"చిత్తం" అంటూ కృష్ణుడూ, "టిర్ టిర్" అంటూ సింగన్నా యెగిరి బండెక్కారు.

గిత్త లెగిరిపోయాయి.

* * *

"ఆ పిల్ల బతు కేమవుతుందోగానీ, రామరామా, వచ్చిన వాళ్ళంతా దద్దమ్మలేనే" అందొక ప్రౌఢ.

"ఊరివాళ్ళుకూడా వున్నారంట ముగ్గురు జజ్జమ్మలు ?" అంది ఇంకో ప్రౌఢ.

"మరెవరయినా వస్తే యేమోగాని, యీపదహారుగురే అయితే మాత్రం పిల్లకి పెళ్ళికాదర్రా, బెంగపెట్టుకోకండి" అంది మరోప్రౌఢ.

"అయితేనూ, పిన్నమ్మా, కృష్ణుడు రాలేదంట యేమే?" అందొక ముగ్ధ.

"నువ్వు కృష్ణుడికోసమే వచ్చావా?"

దానిమీద "మరినువ్వు?" "మరినువ్వు" "నీమాట చెప్పవో" "నీసంగతి చెప్పవో" "నీవుద్దేశం నాకు తెలియదన్నట్టు మాట్లాడతా వేమిటే?" "నీవుబలాటం దాస్తే దాగుతుందంటే?" "నీకోరిక ఆమాటలోనే తెలిసిపోయింది లేవే" "నీగుట్టు బట్టబయ లయిపోయింది పోవే" అంటూ చేతులు చాపుకుంటూ అందరూ తలొకర్నీ దెప్పుకున్నారు.

"దాపరికా లెందుకూ? అందరూ కృష్ణుని కోసమే వచ్చాంసరా, వూరుకోం డింక" అందొకప్రౌఢ, కళ్ళు తిప్పుకుంటూ.

"ఆమాటన్నావు బాగుంది" అందొకప్రౌఢ.

"తగువు తీర్చేసింది మాఅక్క" అందొకప్రౌఢ.

"సరే, కృష్ణుని సంగతి యెవరికయినా తెలిసిందా, అది చెప్పండి ముందు" అంది మరోప్రౌఢ.

"వచ్చివుంటే దాగుతుందా, రాదలుచుకుంటే యింతవరకూ రాకుండా వుంటాడా?" అనడిగిం దొకప్రౌఢ.

"వారికీ వీరికీ యిష్టాల్లేవేమో?"

"నందుడు దొరగారు వచ్చారు, యశోదమ్మ వచ్చింది, రోహిణమ్మా కోడలూ కూడా వచ్చారు మరి?"

"రాధమ్మ వచ్చిందా? అదిచెప్పు ముందూ"

"సడే, యిప్పుడిప్పుడే కాదంటే పాలకీ యిలా వెళ్ళిందీ?"

"రాధమ్మ వస్తే కృష్ణుడూ వచ్చా డన్నమాటే"

"పాలకీలోనే వున్నాడేమో యెవరు చూశారూ?"

దూరాన ముందు కోలాహాలం వినపడింది.

"అదేమిటి?" అంటూ గొల్లభామ లులిక్కిపడ్డారు.

తరవాత "వచ్చేసింది బండి, వోస్, వోస్, తప్పుకోండి తప్పుకోండి" అన్నమాటలు వినపడ్డాయి.

"కృష్ణుడా?" అంటూ వుత్సాహంగా చూశారు గొల్ల భామలు.

తరవాత "అడిగో కృష్ణుడు, తప్పుకోండి తప్పుకోండి. ధారివ్వండి దారివ్వండి" అన్నమాటలు వినపడ్డాయి.

"అమ్మయ్యా" అంటూ గొల్లభామలు స్తిమితపడ్డారు.

తరవాత "ఓహ్, ఏమిగిత్తలు, కృష్ణుణ్ణి తరవాత చూడొచ్చు ముందు గిత్తల్నిచూద్దాం రండోస్" అన్నమాటలు వినపడ్డాయి.

"మొగాళ్ళు తప్పుకుంటున్నారు పదండి పదండి" అంటూ గొల్లభామలు ముందుకి వెళ్ళిపోయారు.

* * *

పొద్దువాలింది.

వచ్చినవారందరూ "ఇంత యెండలో యెలాగబ్బా" అనుకుంటూ వుండగానే ఆకాశం అంతా తెరలు తెరలుగా మబ్బుకమ్మేసింది.

దొడ్డిచుట్టూ అంతరువులుగా కట్టిన మంచెలూ, వాటికి వెనకగా వున్న మిద్దెలూ, మేడలూ, గోడలూ, చెట్లూ జనమయం అయిపోయాయి.

దొడ్డిగుమ్మాని కెదురుగా, అర్ధచంద్రాకారంగా, పందిరిలో పెద్ద మంచె కట్టారు.

దానిమీాద కుడికొసని కుంభకుని కుటుంబమూ, దానితరవాత నందుని కుటుంబమూ, దానితరవాత దండపాణి కుటుంబమూ, దానితరవాత హయగ్రీవుని కుటుంబమూ, దానితరవాత, చిత్రకేతువు కుటుంబమూ కూచున్నాయి.

మధ్యభాగంలో పూరివారూ, పొరుగూరివారూ ప్రముఖులు కూచున్నారు.

ప్రముఖులలో వారిప్రముఖురాళ్ళున్నూ వున్నారు.

ఎడమకొసని గిత్తల్ని లొంగతియ్యడానికి వచ్చిన యువకులు కూచున్నారు.

"మీా రిలా చేస్తారనుకోలేదు బావా" అన్నాడు కుంభకుడు నందునితో.

"ఏమీా, ఏంచేశాను బావా?"

"బలరామన్నా, కృష్ణుడూ కూడా రాకూడదూ?"

"జయంతుడయ్యవారినికూడా మరిచిపోవద్దని రాసుకున్నాను గదా వదినా నేనూ?" అంది ధర్మద యశోదతో.

"నేను నిన్ననే వస్తినాయె. ఇవాళ యేమి జరిగిందో, అబ్బాయిల కేమిపని తగిలిందో, నేను చూశానా వదినా?" అంది యశోద, కళ్ళుతిప్పుకుంటూ.

"ఇవాళ వచ్చాయి కాబోలు పనులన్నీ"

"అదలా వుండనియ్యండి బావా, ఈకాలపు కుర్రవాళ్ళు మనమాట వింటున్నారా? మీరే సెలవిప్పించండి"

కుంభకుడు మాట్లాడలేకపోయాడు.

గోవిందూ, మరినలుగురైదుగురు పాలికాపులూ తన్నను సరిస్తూవుండగా దొడ్డిగుమ్మందగ్గిర నుంచునివున్న శతరథుడు మంచెమీదికి చూస్తూ "పొద్దుచాలదు, ఈపాటికి ప్రారంభిస్తే గాని తెమలదు. ఏం, కుంభకం! అయ్యా, పెద్ద లేమంటా?" రనడిగాడు.

కాని, పెద్దలింకా మాట్లాడకమునుపే "వచ్చాడు, వచ్చాడు, దారివ్వండి" అనీ, "బండి దిగుతున్నా, డిలాగే వస్తాడు. గుమికూడకండి" అనీ కోలాహలంగా వినవచ్చింది.

"ఎవరూ?" అంటూ కొందరూ, అనకుండా కొందరూ తేరిచూశారు.

"కృష్ణుడు వచ్చాడు, కృష్ణుడు, కృష్ణుడు, కృష్ణుడు," అంటూ మరీ కోలాహలం అయింది.

అది విని తలపంకించుకుంటూ నందునికేసి చూసి" పెద్ద యుక్తే చేశారు బావగారు" అన్నాడు కుంభకుడు.

"అమ్మయ్యా, బతికాం. వెళ్ళి అమ్మాయిని తీసుకురావే" అంది ధర్మద, తనవెనకవున్న పరిచారికతో.

"అన్నా, సచ్చాను, దత్తయ్యా" అన్నాడు శంకరం, అపవారించి, తనవెనకవున్న దత్తయ్యతో.

దండపాణి నిరాశగా నిట్టూర్పు విడిచాడు.

చెయ్యి జాడించి, సిరిదాముడు వేలు కొరుక్కున్నాడు.

"సచ్చాన్రా సింగా" అంటూ మూర్ఛపడ్డట్టు గోడకి చేరబడిపోయాడు గోవిందు.

"కృష్ణునిదాకా రానిస్తామా మనం?" అన్నాడు గజపతి తర్జనితో తనని నిర్దేశించుకుంటూ, పక్కవాడితో.

"నేను వీధిలోకి వచ్చానంటే నన్నుచూసి బొమ్మలయిపోతారు భామలు. చివరి కేమయినా కానివ్వండి, పిల్లచూపు మాత్రం నామీదే వుండిపోతుంది చూసుకోండి" అన్నాడు సుదేవుడు, తనపక్కవాణ్ణి తర్జనితో పొడుస్తూ.

"జనానికి బుద్ధిలేదు. కృష్ణుడంటే అలా వూగీసలాడి పోతారేం, మనకంటే యేం పొడిచేశాడా?" అనడిగాడు తుంబురుడు, తన పక్కవాణ్ణి.

ఇదంతా యిలావుండగా, కృష్ణుడన్నమాట వినపడే టప్పటికి, రంకెలువేసుకుంటూ గిత్తలొక్క క్షణం పరవళ్ళు తొక్కాయి.

అదెందుకో తెలియక పోయినా, అదిచూసి మాత్రం అందరూ చకితు లయిపోయారు.

అక్కడ, అంతఃపురంలో "నేను చెప్పలేదూ? బావ, బావ వచ్చేశాడు, వచ్చేశాడు" అంటూ పొంగిపోతూ వెళ్ళిభద్ర నీలని వూపేసింది.

ఎగిసిపడి "నిజంగానే?" అంటూ లేచినుంచుంది నీల.

"వొట్టు, నేను చచ్చిపోయినట్టు" అంది భద్ర.

అప్పుడు "అమ్మా, అమ్మగారు దయచెయ్యమన్నా" రంది వొకపరిచారిక వచ్చి.

"ఉండు వుండు, కసిన్ని పాలచుక్కలు–" అంటూ భద్ర పరిచారికను తొందరపెట్టింది; గాని "పాలచుక్కలూ వద్దు, పచ్చిమంచినీళ్ళూవద్దు, కడుపునిండే పోయింది" అంటూ భద్ర చెయ్యిపట్టుకుని బయలుదేరింది నీల.

## 3 ౨

కృష్ణుడూ బలరాముడూ గోపికలను తప్పించుకుంటూ వెనకాల మెల్లిగా వస్తూవుండగా, ముందు జయంతుడు సభామంటపం లోకి వచ్చి "మానందుడు దొరగారి కృష్ణమూర్తికూడా గిత్తల పనిమీదే వచ్చాడు. పద్దు రాయించండి దొరగారూ" అనగా, శతరథుడు పురోహితుణ్ణిచూసి "మనవాడిపేరు రాయిం చండి"అన్నాడు.

పురోహితుడు "చిత్తం, రాజా" నన్నాడు.

"ఇప్పటి కెందరయినారు?"

"పన్నెండుగురు"

' నాతండ్రి నాతండ్రీ, వచ్చావా కృష్ణా!" "అబ్బా, యింతసేపేంచేస్తున్నావు కృష్ణా?" "నువ్వువచ్చావు, స్వయం వరమంటపం కళకట్టింది కృష్ణా" "తప్పుకోండి తప్పుకోండి ముద్దుకృష్ణునకు దారివ్వండమ్మా" "మాచిన్నికృష్ణునకు దారివ్వండి" "మానందుడన్నయ్య కొడుక్కి దారివ్వండి" "మాయశోదమ్మత్తకొడుక్కి దారివ్వండి" "మురళీమోహ నకు దారివ్వండి" "గోవర్ధనోద్ధారికి దారివ్వండి" "కంసమర్ద నునకు దారివ్వండి" "దారివ్వండి కాళీయఫణమాణిక్య

రంజిత శ్రీపదాంబుజునకు" "దారివ్వండి మానీలమేఘ శ్యాము నకు" అంటూ స్త్రీలు కోలాహలం చేశారు.

"కృష్ణా, కృష్ణా, కృష్ణా, కృష్ణా, కృష్ణా" అంటూ ముగ్ధలు వెంటపడ్డారు.

ఇంతలో, బలరాముడనుగమిస్తుండగా యిటుకృష్ణుడూ, భద్ర అనుగమిస్తుండగా అటు నీలా, ఒకరికోసం వొకరు వస్తున్నట్టు చిరునవ్వు నవ్వుకుంటూ వొక్కమాటే పందిట్లోకి వచ్చారు.

వెంటనే "భద్రా, అమ్మాయి నలా తీసుకువెళ్ళు. మన మడా, నువ్విలా వెళ్ళు" అని శతరథు డిద్దరికీ మంచెలమీదికి దారి చూపించాడు.

అపవారించి "బావా నువ్వూ వొక్కమాటే పెళ్ళిపందిట్లో అడుగుపెట్టారు. పెళ్ళిపీటలమీద మీరిద్దరే కూచుంటారు. సరా?" అనడుగుతూ భద్ర నీలనీ "రావోయి తమ్ముడూ" అంటూ బలరాముడు కృష్ణుణ్ణీ మంచెమీదికి తీసుకువెళ్ళారు.

అందరూ కూచున్నారు.

గిత్తలు మళ్ళీ చెలరేగి, పరవళ్ళు తొక్కాయి.

* * *

"ఇక ఆగడానికి వల్లకాదు, పెద్దలసెలవా?" అన్నాడు శత రథుడు.

"కానివ్వండి, కానివ్వండి" అన్నారు పెద్దలు.

పురోహితు డందించగా "మణిగ్రీవుడు" అన్నాడు శత రథుడు.

వెంటనే, ప్రముఖులకు చేరువగా కూచునివుండిన మణి

గ్రీవుడు, కళ్ళనిండా వొక్కమాటు నీలనిచూసి, సదర్పంగా మంచె దిగాడు.

"భద్రం" అన్నాడు శతరథుడు.

"వీలు తప్పితే వెనక్కి వచ్చెయ్యి దొరా" అన్నాడు గోవిందు, అపవారించి.

అంటూనే తలుపు లోరవాకిలిచేశాడు.

మణిగ్రీవుడు దొడ్లో ప్రవేశించాడు.

నీలగుండెలు కొట్టుకున్నాయి.

ధర్మద కళ్ళు చెదిరిపోయాయి.

దండపాణి హృదయం తుప్పోతుప్పోమంది.

అప్పటికప్పుడే బుస్సలు కొడుతూ గిత్తలు మీద పడ్డాయి.

ఒడుపుగా ఒకగిత్త కొమ్ములుపట్టుకుని, తలకిందికి వంచేసి మణిగ్రీవుడు మెడమీద నాలుగుపోట్లు పొడిచాడు; కాని, తక్కిన గిత్త లతణ్ణి కుమ్మి పడగొట్టి, కొమ్ములతో యెత్తి గోడ యివతలపడేటట్టు విసిరేశాయి.

"అమ్మయ్యో" అనుకుంది నీల.

కృష్ణుడు మొగంవంచుకుని మందహాసంచేశాడు.

"ఒకడు" అంది భద్ర, నీల చెవిలో.

ధర్మద గుండెలమీద చెయ్యివేసుకుంది.

దండపాణి లేచి వెళ్ళాడు.

శతరథుడూ పాలికాపులూ ఆదుర్దాపడుతూ వెళ్ళారు; గాని అంతకిముందే లేచి, మణిగ్రీవుడు బుర్రవంచుకుని యింటోకి వెళ్ళిపోయాడు.

మనిషిని కుమ్మెయ్యకుండా, గిత్తలు, కొమ్ములతో యెత్తి గోడయివతల పడేటట్టు విసిరెయ్యడం చూసి అంతా చకితు లైనారు.

* * *

మళ్ళీ పురోహితు డందించగా "ఘోషవంతుడు" అని పిలిచాడు శతరథుడు.

అతని పేరు వినపడగానే చాలమంది చకితులైనారు.

వారింకా ప్రకృతిలో పడకుండా, అతనుకూడా నీల నో మాటు నిదానంగా చూసి సగర్వంగా మంచె దిగాడు.

"భద్రంసుమా తమ్ముడూ" అన్నాడు శతరథుడు.

"నన్ను తమ్ముడూఅంటావా అన్నట్టు తిరగబడిచూసి, అప్పటికప్పుడే గోవిందు తలుపులు సడలించగా, ఘోషవంతుడు కరుగ్గా చూస్తూనే దొడ్లో ప్రవేశించాడు.

అంతే,

గిత్తలుమీద పడ్డాయి; కాని, వొకగిత్తతోక చేతికిదొరగ్గా అది మెలిపెట్టాడు ఘోషవంతుడు.

అది సాగతీసి తన్నింది.

ఇంతలో తక్కిన గిత్తలతణ్ణి కుమ్మి కూలగొట్టి, కొమ్ము లతో మెత్తి యివతలికి గిరవాటుపెట్టాయి.

నీల మళ్ళీ "అమ్మయ్యా" అనుకుంది.

"రెండు" అందిభద్ర.

"ఇదివరకే నలుగురు పెళ్ళాలున్నారు. ఘోషవంతుని సాహసంచూశా రా బావా" అన్నాడు కుంభకుడు, నందునితో అపవారించి.

కృష్ణుడు బలరాముని కేసి చూశాడు.

ఇంతలో వాళ్ళు దులుపుకుంటూ లేచి ఘోషవంతుడు వెళ్ళిపోయాడు

* * *

మళ్ళీ పురోహితు డందించగా, శతరథుడు "గజపతి" అని పిలిచాడు.

ఆమాట వినడమే తడవుగా, దేవమీ-ఘుడు పళ్ళుకొరుక్కుంటూ కరుగ్గా చూశాడు.

ఇంతలో, పర్వతశిఖరానవుండిన బండరాయి దొర్లి పడుతున్నట్లు గజపతి మంచె దిగాడు.

"శివశివా" అనుకుంటూ కళ్ళుమూసుకుని భద్రని చేరబడింది నీల.

"వోరి నీసిగ్గు చిమడా" అంది భద్ర, గజపతి కేసి చూస్తూ నీల చెవిలో.

"రామా, రామా" అంటూ ధర్మద కుంభకుని కేసి నీరసంగా చూసింది.

ఎదురుగా కూచునివుండిన శంకరం వెటకారంగా మందహాసం చెయ్యగా, సిరిదాముడు ఏవగించుకుంటూ చూశాడు.

"ఒక గిత్తఅయినా పచ్చడి అయిపోతుంది" అన్నాడు జయంతుడు, కృష్ణుని చెవిలో.

"గోవిందూ, తప్పుకో" అన్నాడు శతరథుడు.

గజపతి స్వయంగా తలుపు తెరిచాటప్పటికి "ఎనిమిదో గిత్త" అంటూ కేకవేసిం దొక ప్రౌఢ.

"గిత్తకాదు, గిత్తలకు గుదిబండ" అంది మరొక ప్రౌఢ.

"గుదిబండకాదు, నల్లసరుకు" అంది యింకొక ప్రౌఢ.

గోవిందు తలుపు మళ్ళీ చేరవేశాడు.

దొడ్లోకి వెళ్ళీవెళ్ళడంతోటే, గజపతి, పాపమ్మని ఉరుముతూ తోడచరిచి, పంజాకూడా చూపాడు; కాని యిదేమీ గమనించకుండా గిత్తలు మీదపడ్డాయి.

గజపతి కళ్ళుమూసుకుని ఒకగిత్తమీద విరుచుకుపడ్డాడు.

వెంటనే తక్కినగిత్త లతణ్ణి కుమ్మి కొమ్ములతో యెత్తి విసిరేశాయి.

అయితే, తక్కినవారిలా కాకుండా అతను ముందుగోడ. మీదపడి, అక్కణ్ణుంచి జారాడు.

గిత్త లతణ్ణి కొమ్ములతో యెత్తుతూవుండగానే "కొండవిరుగుతోంది, మీదపడిపోతుంది, తప్పుకోండి" అందొక ప్రౌఢ.

సభఅంతా పకపక లాడింది.

"బతికాను" అంటూ వూపిరి తీసుకుంది నీల.

"మూడు" అంది భద్ర.

"అమ్మయ్యా" అంది ధర్మద.

గజపతి లేవలేకపోయాడు.

"తరువులు వేయించండి" అందొక ప్రౌఢ.

సభ మళ్ళీ గొల్లుమంది.

ఇంతలో పాలికాపులువెళ్ళి లేవతియ్యగా, చురచురచూస్తూ గజపతి బసకి వెళ్ళిపోయాడు.

* * *

పురోహితుడు "సారమేయు" డనగా, శతరథు డామాట రెట్టించాడు.

అందరూ తేరిచూశాటప్పటికే, మీసం దువ్వుకుంటూ సారమేయుడు మంచె దిగి దొడ్లో ప్రవేశించాడు.

గిత్తలుకూడా అంతవడిగానూ అతణ్ణికుమ్మి యెత్తేశాయి.

సారమేయుడు కిందపడ్డాడు, లేచాడు, వెళ్ళిపోయాడు.

"నాలుగు" అంది భద్ర.

"ఏడీ?" అనడింది నీల.

అందరూ "ఏడీ"? అన్నట్టే చూసుకున్నారు.

"పొడిచీ, తొక్కీ, చంపెయ్యకుండా పువ్వుల్లోపెట్టినట్టు అందర్నీ యెత్తి పారేస్తున్నాయి గిత్తలు, ఈవింతలు యేమిటి బావా?" అంటూ. కుంభకుడు ఆశ్చర్యపడగా "అవి కేవల వృషభజాతికి చెందినవి కానట్టు తోస్తుం" దన్నాడు హయగ్రీవుడు.

"ఎవరో శాపగ్రస్తు లనుకుంటాను" అన్నాడు నందుడు.

"ఎవరో వొకమనుష్యమాత్రుడు వాటిని లొంగతియ్యడం సంభవిస్తుందా?" అన్నాడు చిత్రకేతువు.

ఇదంతా వింటున్నధర్మద "నువ్వేం చేస్తావు" అన్నట్టూ, నీల "నిన్నే నమ్ముకున్నా" నన్నట్టూ కృష్ణుని కేసిచూశారు.

* * *

"తుంబురు" డన్నాడు పురోహితుడు.

శతరథుడు మంచెమీదికి చూశాడు.

పళ్ళూ పిడికిళ్ళూ బిగించి వసంతరాగం గొణుక్కుంటూ తుంబురుడు మంచె దిగాడు.

"పాడుతున్నాడా.?" అనడిగింది నీల భద్రని.

"పద్ధతి బాగుంది. నేను పిల్లంగోరు తెచ్చుకోవలసింది" అన్నాడు శంకరం, దత్తయ్యతో.

శతరథుడు "తంబురా మరిచిపోయావురా" అనగా "ఏమిటిదోరా?" అని తెల్లపోతూనే గోవిందు తలుపు తెరిచాడు.

వసంతకళ వొకటి గట్టిగా విసిరి తుంబురుడు ముందుకురగ్గా, రంకెలు వేసుకుంటూ గిత్తలు మీదపడ్డాయి.

గిత్త లతణ్ణి కొమ్ములతో ఎత్తుతుండగానే "అయి" దంది భద్ర.

"రాగంపూర్తి అయిందోలేదో ?" అన్నాడు జయంతుడు.

తుంబురుడు గోడమీదుగా కిందపడుతుండగానే వొకప్రౌఢ "యీపాటికి నాదనామక్రియ దొరకపుచ్చుకో" మంది గాని కిందపడీపడగానే లేచి దారిపుచ్చుకున్నాడు తుంబురుడు.

* * *

"దేవమీాఢుడు" అన్నాడు పురోహితుడు.

"వినపడిందా ?" అన్నాడు శతరథుడు పైకిచూస్తూ.

"వస్తున్నా" అని సాగతీసుకుని, వూగిసలాడుతూ మంచె దిగాడు దేవమీాఢుడు.

"హాయ్ హాయ్ ! ఆ గజపతే మనిషి, యీ దేవమీాఢుడే మనిషి" అంది భద్ర, నీల చెవిలో.

"గిత్తలకు ఈడూజోడూ అయినజోడు, సెబాస్" అందొక ప్రౌఢ.

"అన్నయ్యా, ఎగిరిపోతావు జాగ్రత్త" అందొక ముగ్ధ.

"ఏడూ, ఏడూ పద్నాలుగు గిత్తలయినా అతనిచేతిలో ఆగవు, ఏం బలరామన్నా ?" అన్నాడు జయంతు, డపవారించి.

"మూడులోకాల్లోనూ ఇలాంటి పెళ్ళికొడుకు దొరకడు. ఏం వదినా ?" అంది ధర్మాన, యశోదతో.

ఇంతలో దేవమీాధుడు పురోహితుని దగ్గిరికి వెళ్ళాడు.

అందు కందరూ ఆశ్చర్యపడుతుండగా "నాపేరు కొట్టె య్యండి" అన్నాడు దేవమీాధుడు.

"అదే ?" మన్నాడు శతరథుడు.

"ఏమయితే యేం, కొట్టెయ్యవలసిందే"

"గిత్తల్ని చూశావా, యెవర్నీ బాధించడంలేదు. ఒకవేళ, తప్పిదారి ఏకొమ్మయినా తగులుతుందంటావా, నీకు గాయం కాదు, తీరావచ్చి వూరికే వెళ్ళిపోడంయేమిా?"

"వెళ్ళిపోనివ్వండి బాబయ్యా" అన్నాడు కుంభకుడు.

దేవమీాధుడు వెళ్ళిపోయాడు.

"ఏం, గిత్తల్ని దయదలిచాడా ?" అందొక ప్రౌఢ.

"లేదు, ఔషధంపుచ్చుకొని బలిసివస్తా" డంది మరొకప్రౌఢ.

"మాట్లాడవద్ద" న్నట్టు శతరథుడు చెయ్యూపాడు.

* * *

అయినా, గుసగుసలు తప్పలేదు.

"ఈసందట్లో ఉపాయంచూాడు" అన్నాడు శంకరం, మెల్లిగా.

"ఏం ?" అనడిగాడు దత్తయ్య.

"లాభంలేదు. నీలకి పెళ్ళికాదు. గిత్తల్నెవడూ లొంగ తియ్యలేడు"

"గొల్లభామలు లేవిడీలు కొట్టరూ"?

"అందుకేగా నిన్ను పాయం చూడమన్నది"

"అయితే, దేవమీాఢుడు తొక్కిందేదారి"

"ఛూంత్ !"

ఇంతలో "దేవలుడు" అన్నాడు పురోహితుడు.

"త్వరగా రావాలి" అన్నాడు శతరథుడు.

దేవలుడు మంచె దిగాడు.

"ఏం, నాయనా"? అనడిగాడు శతరథుడు.

"తలుపు తీయించండి" అన్నాడు దేవలుడు.

శతరథుడు తనకేసి చూడగా గోవిందు తలుపు తీశాడు.

దొడ్లో ప్రవేశించి "దా, దా, దా" అన్నాడు దేవలుడు చెయ్యిజాపి.

గిత్తలు బుసకొట్టి వూరుకున్నాయి.

అందరూ చకితులైనారు.

ఇంకో అడుగు ముందుకి వేసి మళ్ళీ "దా, దా, దా" అన్నాడు దేవలుడు, చెయ్యిజాపి.

గిత్తలు మళ్ళీ బుసకొట్టి వూరుకున్నాయి.

దాంతో గర్వించి దేవలుడు ఎదురొమ్ము విరుచుకుని నాలుగువైపులా చూశాడు.

ఒకప్రౌఢ "ఔరా" అంది, గడ్డంమీాద చెయ్యివేసుకుని,

మరోప్రౌఢ "అదిరా" అంది చెయ్యి జాడిస్తూ.

ఇంకోప్రౌఢ "భళిరా" అంది, చప్పట్లుకొడుతూ.

దానిమీాద పురుషు లందరూ "సెబాస్" అంటూ చప్పట్లు కొట్టారు.

దేవలుడు మీసంమీద చెయ్యివేసుకున్నాడు.

అం తే.

ఉత్తరక్షణంలో గిత్తలు మీదపడ్డాయి.

దేవలుడు "దా, దా, దా" అంటూనే వున్నాడు; కాని, గిత్తలుమాత్రం. రెంకుకుమ్మలుకుమ్మి కొమ్ములతోయెత్తి యువతల పారేశాయి.

అందరూ దిగ్భ్రాంతులయినారు; కాని వొకపిల్లమాత్రం "దా, దా, దా, దాయ్, దాయ్, దాయి దాయి రావే, జాబిల్లి రావే" అంది.

అందరూ ఫక్కుమన్నారు.

ఈసందట్లో వొళ్ళుదులుపుకుంటూ లేచి దేవలుడు బస లోకి వుడాయించాడు.

భద్ర "ఏదు" అవగా, నీల, విరగబడినూసి మందహాసం చేసింది.

* * *

పురోహితుడు "చిత్రకుడు" అనగా శతరథుడు "రావాలి" అన్నాడు.

చిత్రరథుడు మంచెదిగి శతరథునిదగ్గిరికి వచ్చాటప్పటికి "మొదటి అక్షరం మార్చండి" అందొక ప్రౌఢ.

చిత్రకుడు ధుమధుమలాడుతూ దొడ్లోప్రవేశించాడు.

అంతకంటే రుసరుసలాడుతూ వెంటనే గిత్తలు మీద పడ్డాయి.

మొదట చిత్రకుడు గిత్తలను దూషించడమే వినపడింది; కాని, యువతలపడేదాకా అతని నెవరికీ కనపడలేదు.

భద్ర "ఎనిమిది" అనీ, వాళ్ళప్రౌఢ "చిత్రం" అనీ వాళ్ళమాటే అన్నారు.

చిత్రకుడు లేచివెళ్ళిపోయాడు.

*　　　*　　　*

"అనుపదేవుడు" అన్నాడు పురోహితుడు.

శతరథుడు సైకిచూశాడు.

అనుపదేవుడు మంచెదిగి తానే తలుపులు తోసుకుని దొడ్లోకి ప్రవేశించాడు.

అందు కందరూ ఆశ్చర్యపడుతుండగా అంతవడిగానూ అతనివతలపడి, లేచివెళ్ళిపోయాడు.

భద్ర "తొమ్మిది" అంది.

*　　　*　　　*

పురోహితుడు "శంకరం" అన్నాడు.

అదివిని ఏవగించుకుంటూ నీల కళ్ళుమూసుకుంది.

సిరిదాముడు మొగం వంచుకున్నాడు.

"ఏంచెబుతా?" వన్నాడు శంకరం, దత్తయ్యని.

దత్తయ్య వూరుకున్నాడు.

తలపంకించుకుంటూ వెంటనే మంచెదిగి, శతరథుని దగ్గిర నుంచుని, నాలుగుదిక్కులా చూస్తూ "నరనారీమణులారా" అన్నాడు శంకరం, గొంతెత్తి.

భద్ర వెటకారంగా చూసింది, నీలని తట్టుతూ.

"ఏమిటి సంగతి?" అన్నాడు శతరథుడు.

"నాకో ధర్మసందేహం వుంది" అన్నాడు శంకరం.

"ఏమిటి?" అన్నాడు శతరథుడు.

శంకరం మళ్ళీ నాలుగుదిక్కులకూ తిరుగుతూ "నరనారీ మణులారా, ఏకుగిత్తల్ని, ఏకకాలంలో, ఒక్కమనిషి లొంగతియ్యాలంటే మీరందరూ చూస్తూ వూరుకోడం ధర్మమేనా?" అనడిగాడు, గొంతెత్తి.

అందరూ చకితులైనారు.

"ఓరోరి శంకరయ్యా, నీమూతి వంకరయ్యా" అంది వెటకారంగా దుర్గ.

దానిమీద అందరూ తలోమాటా అన్నారు.

తలవంచుకుని శంకరం వుడాయించాడు.

"పది" అంది భద్ర.

"వెళ్ళిపోయాడా?" అనడిగింది నీల, కళ్ళుమూసుకునే.

"ఆ" అంది భద్ర.

*　　　*　　　*

పురోహితుడు "సుదేవుడు" అన్నాడు.

సుదేవుడు లేచి నుంచున్నాడు; గాని కిందికిదిగక "కృష్ణా, లొంగతీస్తే నువ్వులొంగతియ్యాలి గిత్తల్ని. మరెవరివల్లా కాదు" అన్నాడు.

"అధైర్యపడకన్నయ్యా" అన్నాడు కృష్ణుడు.

"అధైర్యం కాదు, నేను ధీమాగానే దొడ్లో ప్రవేశించగలను. గిత్తలు కూడా ఎవరికీ ప్రాణాపాయం కలిగించడంలేదు, చూస్తూనే వున్నాను; కాని, లాభంలేదని తెలిసీ కూడా ప్రయత్నించనా?"

"తీరా వచ్చావుగదా?"

"వచ్చాను కనక, నువ్వు గిత్తల్ని లొంగతియ్యడమూ, నీలని చేపట్టడమూ చూసి ఆనందించి వెడతాను"

"అయితే, నన్ను దీవించు"

నీల చకిత అయిపోయింది.

"సరసుడు" అంది ధర్మద.

"అసురుని వంటి వాడు పాపం" అంది యశోద.

అప్పటి కప్పుడే సుదేవుడు మంచెదిగి "నావల్లకాదు, దండాలు, కృష్ణుణ్ణి పిలవండి" అంటూనే వెళ్ళి ప్రేక్షకుల్లో చేరాడు.

ఒక్కక్షణం ప్రశంసలు రేగాయి.

పురోహితు డుదించక పూర్వమే "నాయనా, కృష్ణా" అన్నాడు శతరథుడు, చెయ్యెత్తి.

అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

అతని స్వరంలో కంపం కనబడింది.

అతని మొగాన "నీవే తప్ప నితఃపరం బెరుగ" అంటున్నట్టు మూఢభక్తి మెరిసింది.

కృష్ణుడు లేచినుంచుని "చిత్తం తాతయ్యా" అన్నాడు.

"దిగిరా నాయనా" అన్నాడు శతరథుడు.

ఇలా అంటూండగా అతని కళ్ళు అరమూతలు పడ్డాయి.

ఆకళ్ళకి "తనవెంటన్ సిరి, లచ్చివెంట అవరోధ వ్రాతమున్" అన్న భావన కనపడింది.

ఈసమయంలో "కృష్ణా, కృష్ణా, కృష్ణా" అంటూ గొల్లభామలు కోలాహలంగా పిలిచారు.

అది విని రంకెలు వేసుకుంటూ గిత్తలు మళ్ళీ పరవళ్ళు తొక్కాయి.

అది చూసి అందరూ చకితులైనారు.

"అబ్బాయి పేరువినేటప్పటికే గిత్త లెగిసి పడుతున్నాయేంచేతునండీ!" అంది యశోద, ఆత్రంగా నందునితో.

"అదేమిటి బావా?" అన్నాడు కుంభకుడు కూడా.

తలపంకించి "అబ్బాయి కోసమే పుట్టినట్టున్నాయి గిత్తలు" అన్నాడు నందుడు, ఆలోచిస్తూ.

సిరిదాముడు తేరిచూశాడు కృష్ణుణ్ణి.

ఇదిలా అవుతుండగానే ముందు జయంతుడూ, తరవాత కృష్ణుడూ, అతని వెనకాలే బలరాముడూ కిందికి దిగారు.

దిగీదిగడంతోనే కృష్ణుడు శతరథునకు పాదాభివందనం చేశాడు.

"శుభం నాయనా" అంటూ శతరథుడు కృష్ణుణ్ణొకమాటు కౌగిలించుకుని శిరస్సు మూర్కొన్నాడు.

చిరునవ్వు నవ్వుతూ వెళ్ళి "బాగున్నావ్ గోవిందూ?" అన్నాడు కృష్ణుడు.

వొణికిపోతూ, తూలిపోతూ . "బాగున్నాను దొరా, నీకాళ్ళు మొక్కుతా దొరా, నాగిత్తల్ని చంపకుదొరా" అని దోసిలివొగ్గి ప్రాధేయ పడుతూనే పక్కకి తప్పుకున్నాడు గోవిందు.

అందుకే సిరిదాముడు అగ్గయిపోగా, శ్రీకృష్ణుడు "నడగొండలవంటి యేదుగిత్త లుండగా నీకేంలోటూ, ధైర్యంగా

వుండు" అనడమూ "ఏడుకాదు, పద్నాలుగు గిత్తలుండినా నువ్వు వచ్చాక ఇంకెక్కడి ఆశ దొరా?" అనడుగుతూ గోవిందు ఇంకా వెనక్కి జరగడమూ జరిగిపోయింది.

ఇంతలో బలరాముడు వెనక్కి చూశాడు.

వెంటనే బలరాముని వెనక వుండిన సింగన్న వెళ్ళి, దొడ్డి తలుపులు తెరిచేశాడు.

సింగన్నని చూసి గోవిందు కొయ్యే అయిపోయాడు.

సింహం పిల్లలాగ కృష్ణుడు దొడ్లో ప్రవేశించాడు.

అంతవరకూ దొడ్డిమధ్య గుమిగావుండిన గిత్తలు, కృష్ణుణ్ణి బరిమీద చూడగానే, బుస్సలు కొడుతూనే వెనిక్కి వెళ్ళి, అర్ధచంద్ర వ్యూహంగా నిలిచి మళ్ళీరంకెలు వేశాయి.

అప్పుడు బలరాముడు ద్వారబంధాలు పట్టుకునుంచుని "తమ్ముడూ, తెలిసిందా?" అనడగ్గా, కృష్ణుడు "తెలిసిందన్నయ్యా" అన్నాడు.

పురుషులందరూ కళ్ళప్పగించి వూరుకున్నారు.

ఇంతలో గిత్తలు కృష్ణునిమీద పడ్డాయి.

కృష్ణుడు గిత్తలమీద పడ్డాడు.

అది చూడలేక, నీలా, భద్రా, ధర్మదా, యశోదా, రాధా, గొల్లభామలూ, తక్కినఅందరు స్త్రీలూ కళ్ళుమూసుకున్నారు.

చూస్తుండగా, దొడ్లో, గమ్మున దుమ్ము రేగింది.

కొంతసేపు కృష్ణుని సింహనాదాలూ, గిత్తలబుస్సలూ తప్ప మరేమీ వినపడలేదు.

"గిత్తలింకా వూరుకున్నాయేం?" అనుకున్నాడు సిరిదాముడు.

"ఇలాగ నిలిచి పోరాడగల మొనగాడే లేక పోయా డింత వరకూ?" అన్నాడు హాయగ్రీవుడు.

ఇక్కడ, అరమూతలుపడ్డ కళ్ళతో, చేతులు దోయిలించుకుని నందుడు ధ్యానమగ్నుడై వుండడమూ, అక్కడ, చిరునవ్వుతో, దొడ్లోకి చూస్తూ బలరాముడు స్తిమితంగా నుంచుని వుండడమూ చూసి కుంభకుడు చకితుడయి పోయాడు.

ఇంతలో, బారుమంటూ వొకగిత్త రక్తం కక్కుకుంటూ, దూరంగా పడిపోయింది, విసి రేసినట్టు.

అదిచూసి, అగ్గయిపోయి, వెళ్ళి కృష్ణుని మీదపడదామనుకున్నాడు సిరిదాముడు; కాని, యింతలో, చచ్చిపోయిన గిత్త ఒక రాక్షసుని శవం అయిపోవడం చూసి చల్లబడి నీళ్ళు కారిపోయాడు.

దీనికిసాయం "అరే, అరే, అవి గిత్తలు కావు, రాక్షసులు" అంటూ నలుమూలలా కోలాహలం చెలరేగింది.

అదివిని స్త్రీలందరూ కళ్ళు తెరిచేటప్పటికి మరోగిత్త కూడా పడిపొయి, మరో రాక్షసుని శవం అయిపోయింది.

"నానాయన, నానాయన" అంటూ యశోదా, నోటమాట లేక రాధా అమాంతంగా లేచి నుంచోగా ధర్మద "వదినా" అని, మరి మాట్లాడ లేకపోయింది.

అప్పటి కప్పుడే పూలదండ చేతపుచ్చుకుని నీలా, ఆమె జబ్బలుపట్టుకుని భద్రా అత్యుత్సాహంతో లేచినుంచున్నారు.

మీాది ప్రాణాలు మీాది కెగిరిపోగా, సిరిదాముడు, నోరు తెరుచుకుని తండ్రికేసి చూశాడు.

"రాక్షసులతోనా స్నేహంచేశావు నాయనా!" అన్నాడు కుంభకుడు.

అక్కడ "చిత్తగించారా దొరగారు" అని జయంతుడడగ్గా, శతరథుడు "అపరాధిని" అంటూ దోసిలి వొగ్గాడు.

ఇంతలో, క్షణాని కొకటి చొప్పున తక్కిన గిత్తలు కూడా రక్తం కక్కుకుంటూ పడిపోయాయి.

అన్నీ రాక్షసశవాలున్నూ అయిపోయాయి.

"అబ్బాయికి మరో గండం గడిచిం" దన్నాడు నందుడు.

"నేను పునర్జన్మ మెత్తాను, నా నాయన్ని కళ్ళతో చూచుకుంటున్నా" నంది యశోద.

చేతులు దులుపుకుంటూ యివతలికి వచ్చి కృష్ణుడు "రండి అన్నయ్యా" అని బలరాముణ్ణీ "ఇంకెందుకూ? పోదాం" అని జయంతుణ్ణీ పిలిచి "బండి పూన్చు" అని సింగన్న కాజ్ఞాపించి "తాతయ్యా" అంటూ శతరథునకు మళ్ళీ పాదాభివందనంచేసి బయలుదేరాడు.

"అదేం నాయనా?" అన్నాడు శతరథుడు, అతికష్టం మీాద కంఠం స్వాధీనపరుచుకుని.

"ఇక్కడ, వచ్చినపని అయిపోయింది. అక్కడ, బోలెడు పనుంది. వుండడానికి వీలులేదు తాతయ్యా" అన్నాడు కృష్ణుడు.

దానిమీద "వచ్చిన పని అయిపోయిందీ ? గట్టివాడవే" అంటూ శతంఘ్న డడ్డం వెళ్ళాడు.

అందుకు కృష్ణుడు "నమ్ముకున్న ప్రాణస్నేహితులను చంపి యిప్పటికే సిరిదాముడు బావకి అపరాధంచేశాను. ఇంకెందుకూ ?" అన్నాడు.

"విన్నావా నాయనా ?" అనడిగాడు కుంభకుడు, అపరాధిలాగ, యెత్తు పడిపోయి, సిరిదాముణ్ణి.

"రాక్షసులనా పెంచావు నాయనా ? అంచేతనే నీకిలాంటి బుద్ధులు పుట్టాయి" అంది ధర్మద.

"కానలేక పోయాను బాబయ్యా" అంటూ సిరిదాముడు మంచె దిగి వెళ్ళగా "చూస్తూ వూరుకుంటారేం బావగారూ ?" అనడిగాడు కుంభకుడు నందుణ్ణి.

"ఊరుకోక చేసే దేంవుందీ ?"

"నీల మీా సొత్తయిపోయింది కదా, నువ్వుకూడా వూరుకుంటావేం చెల్లెమ్మా ?"

యశోద నందుని కేసి చూసింది.

"ఆ, కుర్రపిల్లామా, అప్పుడే పెళ్ళేమిటి బావా కృష్ణునికీ ?" అనడిగాడు నందుడు.

దీనికి సాయం "ఆరాక్షసులేమిటో యిదేమిటో నాకేమీా తెలియడం లేదన్నయ్యా" అంది యశోద.

ఇదివిని, కృష్ణుని ప్రయాణంచూసీ నీల తనకేసి దీనంగా చూడగా "మీారిలా అంటే యెలాగ వదినా ! మంచిమాటే

లేవండి, లేవండి" అంటూ చెయ్యి పట్టుకుని యశోదని లేవ తీసింది ధర్మద.

అక్కడ, సిరిదాముడు, దోసిలివొగ్గి "బావా! మాగిత్తలు రాక్షసులని గుర్తించడం మనుష్యమాత్రులకు సాధ్యమేనా! తెలియక నేను మిమ్మల్ని ద్వేషించడం నిజమే. అందుకిప్పుడు చాలా సిగ్గుపడుతున్నాను. నన్ను కటాక్షించండి, ఇక మీ భృత్యుణ్ణి" అంటూ కృష్ణుని కాళ్ళుపట్టుకున్నాడు.

"ఎంతమాట సెలవిచ్చారు బావా, మీ ప్రతాపం యెక్కడ మే మెక్కడ? పైగా, ఇలాంటి గిత్తలు మీదగ్గిర ఇంకా యెన్నున్నాయో, మీ కేం లోటూ? అప్పుడే బేల పోకండి బావా" అన్నాడు కృష్ణుడు.

"తక్కిన వాటిలోకూడా యిలాంటి గిత్తలుంటే వాటినీ చంపెయ్యండి, మీకడ్డేం?"

"వద్దు వద్దు; పశువుల ధర చాలా పెరిగిపోయిం దిప్పుడు. కాకపోయినా, మీరు నన్ను ద్వేషించినా మీ మీద మాత్రం నాకు ద్వేషం లేదు. మరి సెల విప్పించండి"

"ఆ, యిస్తారు సెలవు. ఇవ్వడాని కాయన నెవరు, ఇంతపనీ చేసి మాసొత్తు అయిపోయి వెళ్ళడానికి నువ్వెవరు, కృష్ణా, మంచో, రావమ్మా వెర్రిపిల్లా" అంటూ నీలచెయ్యి పట్టుకుని బయలుదేరింది భద్ర.

అదివిని అందరూ చకితులై పోయారు.

కృష్ణుడు మందహాసం చేస్తూ నుంచున్నాడు.

"ఏమి టెదంతా ?" అన్నట్టు బలరాముడు కృష్ణుని కేసి చూశాడు.

"మంచి యుక్తే ; మా కృష్ణుడు మీా సొత్తయి పోవడం యేమిటి ? మేమేం పందెం వేశామా?" అనడిగాడు జయంతుడు.

"పందెం వెయ్యలేదు, తాంబూలాలు పుచ్చుకున్నారు"

"ఇది మరీ బాగుంది, తాంబూలాలు పుచ్చుకున్నారనీ, అంటావ్, జామార్లు పుచ్చుకున్నారనీ అంటావ్, గడుసు దానవే"

"చెంగలి బీట్లో నాదగ్గిర నీలపెరుగు పుచ్చుకున్నా డంటే అది తాంబూలాలు పుచ్చుకోడం కాదంటయ్యా వెర్రి బాప నయ్యా !"

"నేను వద్దు మొర్రో అంటే విన్నావా ? చూడు, ముందరి కాళ్ళ కెలా బంధం వేసిందో భద్ర ?" అనడిగాడు జయంతుడు, కృష్ణుణ్ణి నిలవతీస్తున్నట్టు.

"నీల పెరుగా? ఆవి డెవరు అక్కయ్యా?" అనడిగింది రాధ.

"మాయిగాగూ పొరుగూనూ, మాఅమ్మాయి నెచ్చెలి" అంది ధర్మద.

"అబ్బాయి నే మెరుగునూ ?" అనడిగింది యశోద.

"ఏమో వదినా ? రండి రండి"

ముందు ధర్మదా, తరవాత యశోదా రాధా మంచె దిగారు. ఇంతలో భద్రా నీలా కృష్ణుని దగ్గిరికి వెళ్ళారు.

"సిగ్గుపడతావేం ? ఆ అయ్యకి తగ్గ అమ్మవే, చాల్చాలు, దండ వెయ్యి" అంది భద్ర.

కృష్ణుడు శిరస్సు వంచుకోగా నీల పూలదండ వేసింది.

" చెయ్యిపట్టుకో " అంది భద్ర.

కృష్ణుని చెయ్యి పట్టుకొని పక్కకి వెళ్ళి నుంచుంది నీల.

"అయ్యా, తపించారు తపించారు, చివరి కిద్దరూ యేక మయ్యారు. ఇక మీ యిష్టం. ఉంటారూ? మాకున్న కాడికి విందులు పెడతాం. వెడతారూ? పదండి మీ యింటికివచ్చి మేమే విందులు కుడుస్తాం" అంది భద్ర.

కృష్ణుడు మందహాసం చేశాడు.

"కృష్ణా" అంటూ రాధ కృష్ణుని కళ్ళల్లోకి చూసింది.

చిరునవ్వు నవ్వుతూ మొగం వంచుకున్నాడు కృష్ణుడు.

---